అంకితము

చిన్ననాట నన్ను వీడిన

అమ్మ

రత్నమ్మకు

# అన్వేషణ

ఈ రచయిత్రి యం. ఏ. ప్యాసయినది. చక్కని సంస్కారము గలది. నిశితంగా ఆలోచించ గలిగినది. ఈమె యీ రచనలు నా చేతికి వచ్చినపుడు, నేను చదివి ఆశ్చర్యచకితుడనయ్యాను. నేను ఇటీవల, ఇంత సాహసోపేతమైన రచనను ఏ భాషలోనూ చదువలేదు.

మనం నివసించే ఈ సంఘం సామాన్య మానవులకు వాసయోగ్యంగా వుండేటట్లు దిద్దబడినది. దీని నియమాలూ, న్యాయాలూ ఇందుకు అనుకూలంగా సృష్టించబడినవి. అందువల్ల ముందుకు ఆలోచించే వారికిగానీ, పై అంతస్థుస్పర్శసోకిన వారికి గానీ, అన్నీ ఇబ్బందులు గానే వుంటై ! అన్నీ అడ్డంకులే తగులుతై. అప్పుడు అసలు 'ఈ ప్రపంచం ఏమిటి ? దీనికొక ఆదర్శంవుందా ? వుంటే అది ఎటువంటిది ?' అనే ఆలోచనలు చెలరేగుతై ! అన్వేషణ ప్రారంభం అవుతుంది.

"ఈ అన్వేషకులకు ఎప్పటికైనా ఒక ఆదర్శం అనేది కుదుట పడుతుందా?" "ఒక వేళ అలా కుదుటపడినా ఈ అన్వేషకులు దానిని పొందగలుగుతారా?" అనేవి తరువాతి ప్రశ్నలు. కొందరికి మాత్రం ఈ అన్వేషణలోనే పరమార్థం కూడా గోచ

రిస్తుంది. వారికి అందులోనే ఆనందం స్ఫురిస్తుంది. అప్పుడీ అన్వేషణ నిరంతరాన్వేషణే అవుతుంది. అందుకనే కృష్ణశాస్త్రిగారు, "ఇది తుదిమొదలు లేని, ఏ యర్థ మెరుగరాని, వేసటే లేని, వెట్టి అన్వేషణమ్ము" అన్నారు. అన్వేషణ స్వభావాన్నీ, దాని ఆకర్షణనూ, బహు చక్కగా చెప్పారు. ఈ పరిస్థితిలో అన్వేషకుడు 'నిత్యపథికు' డౌతాడు. ఆలోచనాపరుల అందరి అనుభవంలోకి వచ్చే అనుభూతే ఇది. అయితే వారి వారి స్వభావాలను బట్టీ, అంతస్థులను బట్టీ, అనుసరణలో భేదం రావచ్చు.

ఈమె ఒక కవిని రూపకల్పన చేసుకున్నది. ఆ కవిముందు తన సుఖదుఃఖాలను వెళ్ళబోసుకున్నది. ఆవేదనలను చెప్పుకున్నది. ఆత్మార్పణం చేసుకున్నది. కాని ఈ రూపకల్పనకు మాత్రం స్థిరస్వరూపం అనేది ఒకటి వుండడానికి వీలున్నదా? లేదు. రూపకల్పనకూడా, అనుభవం మారుతూ, విశాలపడుతూ వచ్చినపుడు, అది మాత్రం మారకుండా, విశాల పడకుండా ఎలా వుంటుంది. సూక్ష్మంగా పరిశీలించి నట్లయితే ఈ రచయిత్రి చేసుకున్న రూపకల్పన కూడా ఆమె అనుభవం వారిపిడికిలోనై మారుతూ వచ్చినట్లు ఈ రచనల్లో గోచరిస్తుంది. ఇలామారుతూ వచ్చిన రూపకల్పనను గురించి, ఇక బోసి కుర్చీ మీమాంసలోకి దిగటంలో ఆశ్చర్యమేముంది? బోసికుర్చీ పరీక్షా దృష్టుల వల్లనో, లేక మారే తన రూపకల్పనను గురించి తనకే మీమాంసవొచ్చో 'ఈ కవి ఎవరు?' అని ప్రశ్నించుకొని 'అన్నీ' అని చక్కగా

జవాబు చెప్పుకొని ధన్యురాలైంది ఈ రచయిత్రి; వ్యష్టినుంచి సమిష్టికి రూపొందే ఈ పరిణామం అతి సుందరమైనది.

ఈ రచయిత్రి కబీరు చైతన్యులవంటి భగవద్భక్తులవలె తన ఆవేశానికి తానే తట్టుకోలేని భావావేశం కలది. ఈ రచనలు చదువుతున్నంత సేపూ, నా మట్టుకు నాకు, ఒక పెనుగాలిలో చిక్కుకున్నట్లే అయింది. ఏ క్షణం ఈ ఉద్వేగ ప్రవాహం తన అవధులను తానే ఛేదించుకొని ఏ హాట్టలు పోసుకున్న పైరుల మీదకు పరవళ్ళు త్రొక్కుతుందో, అని భయమే వేసింది. ఈమె భావావేశంలో అంత తీవ్రతవుంది. పైగా తన భావావేశానికి ఈమె ముసుగులు వెయ్యదు. అందాలు తొడగదు. ఉబికిన ఉద్వేగాన్ని ఉబికినట్లే పొందుపరుస్తుంది. ఉండిపోనిస్తుంది దీనికి ఒక కారణం, ప్రచురణార్థంకాక, తన కోసమే తాను వ్రాసుకోవటం కావచ్చు. కారణం ఏదైనా దీనివల్ల ఈ రచనల్లో ఒక అలౌకికత్వం, ఒక నవ్యత గోచరిస్తూవుందనే విషయం మాత్రం గమనించ దగినది.

రచయితలు సాధారణంగా సంఘానికి ఏదో ఉపకారం చెయ్యాలనే ఉద్దేశంతో వ్రాస్తారు. ఈ ప్రయోజనాన్ని సాధించడానికి భావించి, ఆ భావాలకు రూపురేఖలు దిద్దుతారు. ఇది మామూలుగా జరిగే పని. కాని ఒక్కొక్కసారి మనస్సులో జ్వలించే ఆరాటాన్ని తీర్చుకోటానికీ, సంక్షోభాన్ని అణచు

కోటానికీ కూడా వ్రాయడం జరుగుతుంది. ఈ రచన ఈ రెండవ కోవకు చెందినది. ఈ రచయిత్రికి ఈ సంగతి తెలుసు. తెలియబట్టే 'నా మానసిక జీవితం నాది' అని నిర్మొగమాటంగా, నిరాఘాటంగా చెప్పగలిగింది. అయితే, ఇటువంటి రచనల ప్రభావం కూడా సంఘం మీద పడకపోదు. సంఘానికి ఉపకారం జరగకుండా వుండదు. అది యాదృచ్ఛికం అయితే అవవచ్చు.

ఇంత ఉద్వేగంతో, ఇంత నిశితంగా, నిజాయితీగా ఆలోచించ గలిగిన ఈ రచయిత్రికి మంచి భవిష్యత్తు వుందని చెప్పటానికి నేను ఈషణ్మాత్రమైనా సందేహ పడటం లేదు ఈమె కనిపెట్టి చూస్తూ ఉండవలసిన రచయిత్రి. ఈమె అన్వేషణ నిరంతరం, నిత్య నూతనంగా సాగాలనీ, దానికి కావలసిన అనుభూతులను ఈమె అనుక్షణం పొందుతూ వుండాలనీ నా అభిలాష.

'సూతాశ్రమం'. గోపీచంద్

# అ ను భూ తి

"కరిగిపోయే కలలు" చదివాను...మళ్ళీ...మళ్ళీ... మెదడులో ఏవో భావాలు మెదిలాయి... ఎందుకో "చలం" Musings జ్ఞాపకం వచ్చాయి... "కరిగిపోయే కలలకీ" Musings కీ ఏదైనా సంబంధం వుందా అని ఆలోచించాను. Musings లో చలం వివిధ విషయాల్ని గూర్చి Muse చేశారు. ఏ ఒక్క విషయాన్ని గూర్చి కూడా గాఢంగా ఆలోచించ లేదు. మనస్సు వివిధ విషయాల మీదికి వెళ్ళింది. ఆ విషయాల్ని గూర్చి అప్పటి మట్టుకు తమకు కలిగిన Feelings ని గ్రంథస్థం చేసారు. కాగా చలం Musings లో వస్తువైక్యత కనపడదు. గాఢానుభూతి గోచరించదు. అది సహజమే. మనం ప్రపంచంలోని అన్ని విషయాల్ని గూర్చి తీవ్రంగా ఆలోచించము. ఆలోచించవలసిన అవసరం కూడా వుండదు. కొన్నిటి పైన ఉబుసుపోక ఏదో దృష్టి సారిస్తాము. కొద్దిగా ఆలోచిస్తాము. వదిలివేస్తాము అంతే వాటి పైకి తిరిగి దృష్టి వెళ్ళదు. ఈ పద్ధతి ననుసరించి చలం Musings వ్రాశారని నా ఉద్దేశ్యం. ఇక కరిగిపోయిన కలల్లో-ఇతివృత్తం ఒక్కటే. కాగా వస్తుసమైక్యత కనపడతుంది. గాఢానుభూతి గోచరిస్తుంది. అందువల్ల రమాదేవి "కరిగిపోయే కలల్ని" చలం Musings తో పోల్చడానికి వీలులేదు. పోనీ ఈ "కరిగిపోయే

కలల" కీ టాగూర్ "గీతాంజలి" కి ఏమైనా పోలికలు ఉన్నాయా? అని ఆలోచించాను. టాగూర్ రచనలో నిగూఢత ఎక్కువగా కనపడుతుంది. అంత ఎక్కువ ఆవేదన, ఆందోళన గోచరించదు. ఉద్రేకోద్వేగాల పాలు కూడా చాలా తక్కువే. ఏదో చక్కని భావం తళుక్కున మెరుస్తుంది అంతలోకే అదృశ్యమవుతుంది. మనని నిగూఢతలో ముంచెత్తుతుంది. ఎందుకో, "కరిగిపోయే కలలు" ఈ కోవకి చెందిన రచన కాదని తోచింది. ఇంకా కొంచం ముందుకు సాగి ఆలోచిస్తే, ఇది ఒక ప్రత్యేక సాహితీ ప్రక్రియగా కనపడింది. ఈ సాహితీ ప్రక్రియకు నామకరణం చేయడం నాకు తరువాయి పనిగా తోచింది. పోనీ ఈ సాహితీ ప్రక్రియకి "అనుభూతి" అని నామకరణం చేస్తే? బాగానే ఉంటుంది. అయినా విజ్ఞులూ, పాఠకులూ ఏమంటారో? కరిగిపోయే కలల్లో, ఒక నిరంతరాన్వేషణ మనకు దృగ్గోచరమవుతుంది. ఈ ఆవేదన, ఆందోళన, అన్వేషణ దేనికని ఆలోచించాను. "Muse of poesy" దర్శన భాగ్యంకోసం కాదు కదా? అనే సందేహం పొడసూపింది. అవును అదే అయి ఉంటుందని, మనస్సు పదేపదే చెప్పింది. ఇంక సందేహం దేనికి? కవితాకన్య సందర్శనంకోసమే ఈ అన్వేషణ అని ఒక నిశ్చితాభిప్రాయానికి వచ్చాను. ప్రతి రచయితా, కవితాకన్య సందర్శనంకోసమే కదూ అన్వేషిస్తున్నది? రమాదేవి దానికి భిన్నంగా ఎందుకు ప్రవర్తిస్తారు? రమాదేవి, ఈ కావ్యంనిండా,

కవితా కన్యకోసం అన్వేషించారు ఆవేదన పడ్డారు. ఆందోళన చెందారు. కుర్చీ బోసిగా కనపడితే గింజుకున్నారు దుఃఖ పడ్డారు. పరితపించారు. తత్ఫలితంగా కవితా కన్య విభిన్నాంశాలలో ఒక అంశాన్ని సమగ్రంగా సందర్శించ గలిగారు. ఫలితం "కరిగిపోయిన కలలు"— అందువల్లనే రమాదేవి ఒక నూతన సాహితీ ప్రక్రియకి మార్గదర్శకురాలై ధన్యత పొందారు.

భాస్కరభట్ల కృష్ణారావు.

# అభిప్రాయం

శ్రీమతి రమాదేవిగారు నా అభిప్రాయాన్ని కోరారే కాని నిజానికి ఈ రచనలను గురించి సమగ్రంగా తెలిపే అర్హత నాకు లేదు. అంత స్థాయికి ఎెరగలేదని నా విశ్వాసం. అయితే నా స్థాయిని బట్టి అర్థమైంది చెబుతాను.

ఒకప్పుడు 3-D చిత్రాలువచ్చాయి. వాటిని మనమామూలు దృష్టితోచూస్తే బొమ్మలు ముక్కలు ముక్కలుగానో, అలికినట్టు గానో కనిపించేవి. అందుకని ఆ చిత్రాలను చూడడానికి ప్రత్యేక మైన కళ్ళజోళ్ళుండేవి. వాటితో చూసినప్పుడు మాత్రమే చిత్రాన్ని సరిగ్గా దర్శించి, పూర్తి ఆనందాన్ని పొందడానికి వీలయ్యేది. ఆ చిత్రాలు అలా తయారు చేయబడ్డాయి. నా బుద్ధితో ఆలోచిస్తే-ఈ రచనలు-కాదు- ఈ రంగుల చిత్రాలు అలాంటి వనిపిస్తుంది. మామూలు దృష్టికి పనికివచ్చే ఈ కండ్ల మీద ఏదైనా తెరవేసేసి-మనసులోకి తెరుచుకునే కండ్లను విప్పి చూస్తేగాని ఈ రచనల్లో చిత్రించబడ్డ రమ్యత, చేకూర్చబడ్డ అందచందాలు, సృష్టించబడ్డ కొత్తలోకాలు కనిపించవేమో ననుకుంటున్నాను. అయితే మనోనేత్రాలను విప్పడానికి ఆయా వ్యక్తుల సంస్కారం, సాధన అవసరమవుతుంది. దాన్ని బట్టి ఈ చిత్రాలు మరీ స్పష్టంగా కనిపించి, అర్థంకావడానికి వీలుంటుం

దనుకుంటాను. నా సాధన ఇంకా సరిపోలేదనిపించింది. అందుకే నేను ఈ చిత్రాల్ని గూర్చి సమగ్రంగా చెప్పలేనన్నాను.

అయితే నాకు ఆశ్చర్య మేమిటంటే శ్రీమతి రమాదేవి గారు మొదటి సారిగానే ఈ రంగుల చిత్రాలను ఎలా చిత్రించ గలిగారనేది. మామూలుగా మన చుట్టూవున్న వాతావరణాన్ని కొంత మరిచిపోయి ఏదో ఒకదాని మీద మనసును కేంద్రీకరిస్తే గాని కవిత్వంరాదని అంటారు. అది వీరికి వర్తించదా అని పిస్తుంది. ఆఫీసులో మాతో కులాసాగా మాట్లాడుతూ మాట్లా డుతూనే, అయిదు నిముషాల్లోనే ఒక కలగని కూచుంటారు. ఆ కలలో ఒకచోట 'నేను' 'తనను' గురించి 'కవి' కి యిలా చెప్పుకుంటుంది : "నేను భావాల భవంతిని; ఊహాల ఊటను; అనుభవాల అంతస్థును; రాగాల రేఖను; జీవితపు సుడిని; శోకాల సూక్తిని; సుఖాల సమాధిని; ధూళిలో రేణువుని; నీటి అలల తీవ్రతని; గాలి తరంగాల హోయిని; విశాల విశ్వ అఖా తాన్ని; అఖాతాల లోతుని; పర్వత శిఖరపు నునుపుని; చిట్ట డవుల చిక్కదనాన్ని; కారుచిచ్చుల వేడిమిని; వెన్నెల తెలుపుని; ఆకాశపు అనంతాన్ని; పూరేకుల మృదుత్వాన్ని; మొగ్గలోని ముగ్ధత్వాన్ని; పిందెలోని పసితనాన్ని; పండులోని నిండు కుండను; పూవులోని బ్రతుకు పంటను; పసిపాప నవ్వులోని నిర్మలతను; కంటిపాప చిరునవ్వుని; పెదవి వంపుని; హృదయపు విశాలతను; మదిలోని మమతను; ఆత్మలోని ఏకత్వాన్ని; శరీ

రపు శూన్యాన్ని; తరగని సానుభూతిని; అవధులులేని క్షమని; హద్దులు లేని ఓర్మిని"- ఇలా ఒక్కొక్క చిత్రం గబగబా వచ్చి నిలుచుంటుంది. వారీ చిత్రాలను ఎంత తేలికగా చిత్రిస్తారో, దాన్ని చూడడానికి గభాల్న ఆగిపోయి ఇదేమిటా అని పరిశీ లించడానికి అంత ఆలోచన పడ్తుంది. ఒక చిత్రాన్ని గురించి ఆలోచిస్తుండగానే మరో చిత్రం వచ్చేస్తుంది... "పెద్ద పెద్ద ఇసుక పర్వతాలు... ఎవరో ఆమె, కాళ్ళు ఇసుకలో కూరుకు పోతున్నా నిలదొక్కుకొని ఆ పెద్ద ఇసుక పర్వతం ఎక్కిపో తోంది... ఎవరో కాదు ఆ మూర్తి — కవి ప్రేయసే... కవికి, ఆ మూర్తి నీడలా ఆ పర్వతం ఎక్కిపోవాలని ఆశ... ప్రేయసి అమాయకంగా ఈ సంగతి తెలియకుండానే ఎక్కిపోయి క్రిందికి చూచింది! తనకు కొద్ది దూరంలోనే క్రిందుగా కవి కూరుకు పోతూ చేయి చాస్తున్నాడు... లాభంలేదు. చేయి అందిస్తే తనతోపాటు ప్రేయసిని కూడా కూర్చేస్తాడు. ఇంకొక మూర్తి ఎవరో రెండోచెయ్యి పుచ్చుకొని, ఆ ఇసుకలో కవిని కూరుకు పోనీయకుండా క్రిందికి దించేయడానికి వస్తోంది..." అంతే కల తెగిపోయింది.

అవును — కల. అన్నీ ఇలాంటి కలలే. కలలు కరిగి పోయేవే కావచ్చు. కాని - అవి కమ్మని కలలు; తియ్యగా బాధించే కలలు; మరిచిపోలేని కలలు; అడుగడుగునా జ్ఞప్తి కొచ్చి ఆనందాన్ని చేకూర్చే కలలు; దృశ్యాలను కండ్లకు

కట్టించే కలలు. ఒక్క మాటలో - అందమైన కలలను అక్షరాల్లో పదిలపరిచారు.

నాకు జ్ఞాపకమున్నంత వఱకు ఇలాంటి రచనలను చదువ లేదు. మామూలు పద్ధతుల్లో కాకుండా కొత్త పంథా తొక్కి తెలుగు సాహిత్యానికి వన్నెచిన్నెలు చేకూర్చిన శ్రీమతి రమాదేవిగారు అభివందనీయులు,

అసలీ రచనను మొట్టమొదట కాలేజీ మాగజైన్‌లో చదివాను. చిత్రిమనిపించింది. ఆలోచనను కలిగించింది. దానికి కారణముంది. ఆలోచించి వ్రాసేవారి రచనలు, ఆలోచించే గుణం గలవారిని ఆకర్షిస్తాయని ఒకసారి శ్రీ గోపీచంద్ గారన్నట్టు గుర్తు. బహుశా ఈ రచనలు కూడా అందుకే ఆలోచనను రేకెత్తించి వుంటాయి. ఆలోచన ప్రారంభం కావడమే అన్వేషణకు మార్గమనుకుంటాను. అదే జరిగింది. 'కరిగిపోయే కలలు', 'నిశి' - ఈ రెండూ ఆలోచించేవారికి పని కల్పించే పదాలు. అందుకే ఆలోచించాను, వారు మాత్రం 'చీకట్లో' వుండి బయటవుండే రకరకాల కాంతులను కాయితమ్మీది కెక్కించా లనుకున్నట్టున్నారు. అయితే - అసలీ 'చీకట్లో' వున్న దెవరు ? అని రెప్పవాల్చకుండా చూసేంత లోతుగా ఆలోచిస్తూ పోయాను అనుకోకుండా.

ఎందుకనో ఒకసారి 'తెలుగు దేశం' పత్రికకు వారు 'నిశి' పేరుతో రచనను పంపుతుండగా చూశాను. "'నిశి' ఎవరో తెలిసిపోయిందండోయ్" అన్నాను. పర్వా లేదన్నారు. ఆ తర్వాత 'నిశి' పేరుతో వ్రాసినవన్నీ చదవాలనే అభిలాషను నేను వెలిబుచ్చడం, వారెప్పటికప్పుడు వ్రాసినవన్నీ ఇస్తూ వుండడం జరిగింది. అప్పుడు వారు 'ఎలా ఉన్నాయన్నట్టుగా' అడిగారు, "అసలు మీరీ ఊహాను ఎలా పెంపొందించు కున్నారో సంజాయిషీ ఇవ్వాలి" అన్నాను. అప్పటికీ, ఇప్పటికీ నేను కోరేదదే.

కె. యల్. నరశింహారావు,
29–5–1957.

# నా మాట

నా కలలు నిజంగా కరిగిపోయేవే. అలా కరగక నిశ్చలంగా స్థాణువులుగా ఉన్న నాడు, ప్రతి క్షణపు ఆవేదన, మాధుర్యము నా అనుభవంలోకి రావు. 'నా కరిగే కలల'లో ని పాత్రిలు మూడు. ఒకటి, 'నేను'. ఇంకొకటి 'నా కవి'. మరి ఒకటి 'బోసి కుర్చీ'. 'నేను' కేవలం నా మనస్సు. నేను నా జీవిత కాలం ఊహించుకుంటూ, వ్యూహాలలో అన్వేషించుకుంటూ, ఆరాధించుకుంటూ ఉండే, నిర్వికార మూర్తి 'నా కవి.' ఇక 'బోసి కుర్చీ' ప్రపంచములోని మానవత్వం. క్షణ క్షణ మొక క్రొత్త రూపాన్ని ధరిస్తూ, ఆ యా రూపాలకు తగిన భావాలతో, శక్తులతో నన్ను రెచ్చగొడుతూ, కృంగదీస్తూ, ఆనంద పరుస్తూ, తోడునిస్తూ, లాలిస్తూ, ఓదారుస్తూ ఉంటుంది.

నన్ను నేను గుర్తించు కోవడానికి ప్రియత్నించిన క్షణంనుండి, పది మందిలో నేను మానసికంగా ఒంటరిగా బాధ పడి నప్పుడు, కాసేపు నా కరిగే కలల్ని కాగితం మీద కెక్కిస్తూ వస్తున్నాను. ఎక్కించాను అనకుండా, ఎక్కిస్తూ వస్తున్నాను. అని ఎందుకంటున్నానంటే నేను భౌతికంగా బ్రతికి ఉన్నంత కాలం, విశాల భౌతిక ప్రపంచపు తాకిడికి లోనగుతూ, నా ఆత్మను పరిశీలించుకుంటూ, దొరకని దేనికోసమో, తెలియని యే శక్తికోసమో వెతుక్కుంటూ, అందని ఆ అద్వితీయ నిరాకార మూర్తిని ఆరాధించుకుంటూ ఉండడం తథ్యం కనుక,

యీా పనులను చేయడానికి, నా గమ్యాన్ని చేరడానికి, 'నా కరిగి పోయే కలలే' నా బాట కనుక, వాటిని వ్రాసుకుంటూ ఉంటాను.

ఆఫీసులో డ్యూటీ చేసుకుంటూ, ఇంటి దగ్గఱ పనిపాటల్లో కాలేజిలో చదువు సంధ్యల మధ్య, 'నా కరిగే కలలలో' కరిగి పోతూ, వాటిని కాగితం మీద కెక్కిస్తూ ఉన్నప్పుడు, అప్పు డప్పుడు నా సహోద్యోగులు, మా వారు, నా సహ పాఠినులు గుర్తించి, వారు చదువడానికి ప్రయత్నించి నప్పుడు, నేను పట్టు బడిన దొంగలా సిగ్గుపడి, వాటిని చింపేస్తూ ఉండే దానిని. కాని వారంతా నేను చేస్తున్న పనికి సహృదయంతో మందలించి "మేము చూస్తామని ఎప్పుడూ అడగం. కనీసం వాటిని చింప నసైనా మాట ఇవ్వ" మని అడిగి అలా వాగ్దానం పుచ్చు కున్నారు నా దగ్గఱనుండి. రెండేళ్ళ క్రితం నా సహపాఠినులు "ఏదైనా కథ వ్రాసి యివ్వమంటే నాకు చేతకాదంటావు. నువ్వు అప్పుడప్పుడూ వ్రాసుకుంటూ ఉండేవి ఏవైనా సరే వేసేస్తాం తప్పనిసరిగా. నీ కంత అభిమానంగా ఉంటే నీ పేరు మార్చియ్యి"అని స్నేహరీత్యా మోమోట పెట్టారు. 'నిశి' అనే పేరుతో కొన్ని 'కలలు' కాలేజి మాగజైనులో ప్రచురించ బడ్డాయి. తరువాత మా వారు "ఇలాంటివి ఇంకా వ్రాసి ఏ పత్రికకన్నా పంపగూడదూ! అప్పుడప్పుడు వ్రాసుకుంటూ ఉంటే ఏ నోట్సో అనుకున్నాను" అన్నారు. నాకు వాటిని ప్రచుర ణకు పంపే ఉద్దేశ్యం లేదని తెలుసుకుని "ఇక నీ యిష్టం" అని

ఊరుకున్నారు. ఒకసారి శాస్త్రభట్ల కృష్ణారావుగారు మా యింటికి రావడం, వీటిని చదువడం తటస్థించింది. వారు మా వారితో "ఆవిడకు పంపడం బద్ధకమైతే కనీసం మీరైనా వీటిని ఏ ప్రతికకైనా 'పోస్టు' చేయండి. మీకూ తీరిక లేదనుకుంటే, నా కివ్వండి నేనైనా పంపుతాను" అన్నారు. ఆఫీసులో వ్రాసు కుంటున్నప్పుడు "ఏదో వ్రాస్తున్నట్లున్నారే?" అని K. L నరసింహారావుగారు తీసుకుని చదివి, వీటిని పుస్తక రూపంలో వేస్తే బావుంటుందని సూచించేవారు. శ్రీ రాజశేఖర్ ఒక సందర్భంలో వీటిని చదవడం తటస్థించి, తప్పక ప్రచురించమని ప్రోత్సహించారు, గోపీచంద్ గారు కూడా ఇదే మాట అంటూఉండేవారు. తరువాత యల్లాప్రగడ సీతాకుమారిగారిని కలుసుకోవడం తటస్థించింది. మాటలలో ' నా కరిగే కలల ' సంగతి వచ్చింది, "నారాయణరావుగారు వీటిని పుస్తక రూపంలో వేస్తారమ్మా నీ కిష్టమయితే" అన్నారు

నేను మాత్రం వీటిని ప్రచురణార్థం వ్రాయలేదు. ప్రచురణార్హం అని కూడ అనుకోలేదు. అయినా పెద్దలు, శ్రేయోభిలాషులు ప్రోత్సహించడంవల్ల, వారియందు నాకున్న గౌరవం కొద్దీ నేను ఒప్పుకున్నాను, నన్ను ప్రోత్సహించిన ఆప్తులకు, శ్రద్ధతో అచ్చువేసి యిచ్చిన శివాజి ప్రెస్ వారికి ఏ విధంగా కృతజ్ఞతలు తెలపాలో నాకు తెలియడం లేదు.

హైదరాబాద్. రమాదేవి

## రా బో వు ర చ న లు

1. నా సడలే సత్యాలు
2. అతీత మానవుడు (నవల)
3. రేఖ (నవల)
4. తల్లి - బిడ్డలు (నవల)
5. సుడి గుండాలు (పెద్ద కథలు)
6 ఎక్కడికి పోస్టు చేయను? (చిన్న కథలు)
7. విచిత్ర ప్రవృత్తులు (కథలు)
8. అమానుష శక్తులు (కథలు)
9. దృక్పథం (వ్యాసాలు)
10. స్మృతులు (స్వగతాలు)
11. భావనా వీచికలు (పిల్లలకు)
12. కబుర్లు (పిల్లలకు)





రచయిత్రి — రమాదేవి
జననం — 1935
నివాసం — హైద్రాబాదు.

# నా కరిగిపోయే కలలు

## 1

ఒంటరిగా హాయిగా ఊపిరి పీల్చుకున్నాను. నా ఎదుటి కుర్చీ ఖాళీగా మూలిగింది. ఆ రెండు చిన్నచిన్న నిండు కళ్ళు అరమోడ్పుగా కలలు కంటూ నన్ను చూస్తున్నా యేమోనని ఒక్కసారి త్రుళ్ళిపడి చూచాను. బోసిగా వెక్కిరించింది నా ఎదుటి కుర్చీ...పాపం ఎంత పిచ్చివాడు! చిన్న పిల్లవాడికంటె అన్యాయం! ఒకొ్కక్కసారి ఎట్లా ఉంటాడు! – తల్లీ, తండ్రీ, నా అనేవాళ్ళు ఎవరులేని పిల్లవాడు. 'నా కెవరూలేరు, ఎవరూ నన్ను ప్రేమగా చూడరు, ఛీ! అంతా వెధవలే'అని కసిగా ఏడ్చిపడ్చి చొక్కాతో కళ్ళు తుడుచుకుని బయటకు వస్తున్నట్లుగా ఉంటాడు. అప్పుడు తన ముఖాన్ని హృదయానికి హత్తుకుని నుదురుని, కళ్ళన్ని, ముక్కుని ముద్దుపెట్టుకుంటూ, తల నిమురుతూ తల్లిలా లాలించాలని ఉంటుంది.........

కవి నన్ను తనలోకి లాగేసుకుంటున్నట్లు చూస్తూనే, కలలుగంటూ, ఊహా ప్రపంచంలోకి తేలిపోతాడు. ఆ ఊహా ప్రపంచంలో నన్నుకూడ ఎంత మార్చేస్తాడని!



నాలోలేని అందాలన్నీ కల్పించుకొని, సౌందర్యరాశిగా ఊహించుకుంటూ, ఆ ఊహాలలోనె నన్ను ఉక్కిరి బిక్కిరి చేసేస్తూ తనలోక లీనమైపోయేటట్లుగా కౌగలించు కుంటున్నా ననుకుంటాడు...... కల కరిగిపోతుంది ...నేను, ...నా నిజ స్వరూపం...కవికి నామీద కసి...... కాని నిస్పృహాలో సంతృప్తి.

అబ్బ!! ఇంత సేపూ ఒంటరిగా ఉన్నానా! ఒంటరిగా ఎక్కడ! ఎదురుగా ఖాళీ కుర్చీ నాకు ఊహాల్ని కల్పిస్తూ తోడుగా ఉందిగా !!

## 2

భారంగా వచ్చాను. నా ఎదుటి ఖాళీ కుర్చీ బోసిగా ఆహ్వానించింది నన్ను, ఆ బోసితనంలోనే ఎంత నిండుతనం ఉంది! "ఎవర్ని గురించి ఆలోచిస్తున్నావు? కవిని గురించి ఆలోచిస్తున్నావు కదూ! నీకళ్ళ ఎఱుపే తెలుపుతోంద" అంటోంది నా ఎదుటి కుర్చీ. పిచ్చి కుర్చీకి పూర్తిగా ఏం తెలుసు? నా జీవితంలో అన్ని రాత్రింబవళ్ళు నా అమాయకపు కవిని గురించే ఆలోచిస్తానని అసలెవరికీ తెలియనీయను. కవి యీ ప్రపంచాన్నంతా అర్థం చేసుకుని, ఊహించుకొని ఎన్ని కథలైనా వ్రాయనీ! నా హృదయాన్ని మాత్రం అర్థం కానీయను......

అసలు నన్ను నేను అర్థం చేసుకున్నానా? ఎక్కువసార్లు మనల్ని మనం అర్థం చేసుకోలేక పొరబడుతూ ఉంటాము. ఇక ముందెప్పుడూ తెలియక పొరపడను. నేనెవర్నో నాకు తెలుసు. నా లోపాలు, నా గుణాలు అన్నీ తెలుసు నాకు కాని నాకేం కావాలో తెలియదు... అన్నీ కావాలి...ఏమీ అక్కర్లేదు. కాని కవికి ప్రస్తుతం నేను కావాలి— చిన్న పిల్లలకు తీపి తినాలని ఉంటే మిఠాయి కావాలి. మిఠాయి పెడితే పట్టలేని ఆనందంతో తింటారు. కొంత సేపటివఱకు నోరు తియ్యతియ్యగ ఉంటుంది. ఇంకా కొంత సేపటికి మిఠాయి తిన్న సంగతే గుర్తుంటుంది. తియ్యదనం లీలగ తోస్తుంది. అంతే— మిఠాయి అసలు తినడానికి లేకపోతే కచ్చిగా కాసేపు కాళ్ళూ, చేతులూ తన్నుకుంటూ, తలుపులు బ్రద్దలుకొడుతూ ఏడుస్తారు బుగ్గలమీది కన్నీళ్ళు ఆరిపోయాక దాన్ని గురించే మర్చిపోతారు. కవీ అంతే. నేను తనకి కావాలి. నేను తన దాన్నయితే కొంత కాలం స్వర్గంలోకి తేలిపోతాడు. తన హృదయపుటద్దంలో నా బొమ్మ అందంగా కనపడుతుంది. కొంత కాలానికి అద్దాన్ని తుడుచుకోవడం మర్చిపోతాడు. నేను మలినపుటద్దంలో మసక మసకగా, దూరదూరంగా కనిపిస్తాను. ఇంకా కొంత కాలానికి నా స్మృతులు లీలగా గుర్తుకొచ్చి అప్పుడప్పుడూ కొంచెం చిరాకు కలిగిస్తాయి కవికి. నేను తన దాన్ని కాలేకపోతే నా మీద కోపంవచ్చి, అసహ్యంతో, కచ్చిగా కవిత్వంలో నన్ను తిట్టేస్తాడు.

వేడి చల్లారిపోతుంది. నన్ను తలవనే తలవడు. అయినా కవికి పిచ్చిగాని, తాను సంతృప్తి పొందితే హృదయానికి హత్తుకుపోయే కవిత్వాన్ని వ్రాయగలడా? ఆవేదనలో ఉద్భవించిన కవిత్వమే హృదయాన్ని కదిలిస్తుంది కదూ !!

## 3

"ఏమిటో పిచ్చిగా వ్రాసుకుంటున్నావు?" అంటోంది నా ఎదుటి కుర్చీ. నాయిష్టం వచ్చినట్లుగా వ్రాసుకుంటున్నాను. దాని మాటే మర్చిపోయి. అయినా దానికి భయపడడమేమిటి? నాకు నచ్చిందీ, నాకు యిష్టమైందీ చేసుకోవడానికి నాకు హక్కు లేదూ! ఒకవేళ "నీవు చెడ్డదాని వంటుం"దేమో! అంటే నాకేం! అది నిర్ణయించే మంచి చెడులతో నాకు సంబంధం లేదుగా! దానికి కావలసింది నాశరీరం – దాని పవిత్రత - పవిత్రతకు లోటేం చేశాను......? కాని హృదయం మాత్రం నాది. నాయిష్టం వచ్చినట్లుగ ఆలోచిస్తాను. ఎవరున న్నడ్డు పెట్టేది?

ప్రాణం ఉన్న మనుష్యు లెవరిముందు నా హృదయాన్ని విప్పి కథలు చెప్పను. నా కథల్ని ఎవరూ అర్థం చేసుకోవడానికి ప్రయత్నించరుగా? నా ఎదుటి బోసి కుర్చీ అద్దంలో నా హృదయాన్ని ప్రతిఫలింప జేసికొని, దానితోనే నా కబుర్లు, కథలూ అన్నీ చెప్పుకుంటాను. "దానితోనే సంతృప్తిపడ

తావా''? అంటోంది ఖాళీకుర్చీ. పాపం దాని లాగానే నేను కూడ సంతృప్తి కోసం, సంతోష పడడంకోసం ప్రాకులాడుతా ననుకుంది కాబోలు! నాకు వాటితో అవసరమేలేదు. నా జీవిత మంతా ఆలోచిస్తాను. ఎవరికీ తెలియనీయకుండా నాలో నేనే ఆవేదన పడతాను.

చెవి పక్క గడియారం నా కలలకి తాళం వేస్తోంది. నల్లటి చీకటి వంక చూస్తూ నక్షత్రాలని లెక్క పెడుతున్నాను.... కవిసృష్టి నల్లటి చీకటిని చూస్తూ, దాన్ని చీల్చుకుపోయి, దాని వెనుక తెల్లటి వెలుగంటూ ఉందా అని తెగ వెతుకుతుంది. కవి కున్న లక్షణమేగా అది–ఉన్నదాన్ని చూస్తూనే, అనుభవిస్తూనే, లేనిదానికోసం ఆరాట పడటం!

అబ్బ! మళ్ళీ వాస్తవిక ప్రపంచం. నా ఆలోచనలు, నా ఆవేదన, నా కలలే నాకు బావుంటాయి–కాని మధ్య మధ్యలో నా కలలు కరిగి పోయి వాస్తవిక ప్రపంచంలోకి వస్తేనేకాని నా కలల విలువ నాకు తెలియదుగా!!



# 4

కవి ఎక్కడున్నాడో...ఏం చేస్తున్నాడో!...ఎక్కడుంటాడు?...ఊహాప్రపంచంలో తేలిపోతూ ఉంటాడు. ఇక రెండో పని తలపెట్టాడు కనుకనా! జీవితాన్నంతా కదల్చివేస్తూ రోజుల్ని యుగాల్ని కూడా లెక్కపెట్టనీయకుండా చేసే ఆ ఊహా ప్రపంచం ఒక్కటే చాలు......

కవి తన జీవిత నౌకని నడపడానికి ప్రేయసి కావాలంటాడు. పిచ్చికవికి తెలియదు తన ప్రేయసికి తనకు చేయూతనివ్వటం ఒక్కటే పని కాదని...తెలియకా?...ఏదో పిచ్చి నమ్మకం...ఇంకా తన ప్రేయసి తనను ముందుకు నడిపిస్తుందని వెఱ్ఱి ఆశ...నా పిచ్చికవికి యింకేమి తెలియదు తన ప్రేయసిని గురించి కలలు కనడం తప్ప...కవి బాధ పడకుండా ఉండలేదు. ఆ బాధ తీరేదికాదని తెలుసు.........అంతకంటే తానేమీ చేయలేడు.

ఎంత అసహాయుడిగా అయిపోయాడు. "నిన్నెవరు ప్రేమించమన్నారు?......ఎందుకు ప్రేమించావు?" అంటే "నన్ను ప్రేమించమని ఒకళ్ళు చెప్పాలా?...ఎందుకు ప్రేమించావేమిటి?...నాకు నీవు కావాలి...ప్రేమించాను. కేవలం నీ శరీరా న్నొక్కదాన్నే ప్రేమించలేదు...ఎలా చెప్పను...నీవు

అంతా...నీ ఆలోచనలు, నీ తెలివీ, అన్నీ అన్నీ కావాలి... ఎంతకీ పూర్తి తృప్తి ఉండకూడదు మన ప్రేమలో...అనుక్షణం కలలు కనాలి...ప్రేమలో పుటమేసి పోవాలి" అంటాడు కవి.

పసిపిల్లవాడిలా తానేమి మాట్లాడుతున్నాడో తనకే తెలియకుండా మారాం చేస్తుంటే ఏమనాలి?...

## 5

"ఎంత అప్పులతోనైనా నేను నీవనే భేదం లేకుండా ఏక్షణంలోనైనా పూర్తిగా లీనమైపోలేను......వాళ్ళందర్నీ నా ప్రాణంకంటె ఎక్కువగా ప్రేమిస్తాను. కాని ఏదో అణుమాత్రమైనా ఖాళీ మిగిలిపోతుంది మధ్యలో......మనిద్దరి మధ్యా ఆఖాళీకూడా ఉండకూడదు!.........సాధ్యమా?" అంటాడు కవి.

ఆ మాటల్ని పట్టించుకోనట్టుగ, అర్థం కానట్టుగ, నటించి మాటలు మార్చేస్తే......ఇంకేమీ అనలేక తెల్లబోయి పిచ్చిగా నావంక చూచి "నేను సన్యాసినై పోతాను" అంటాడు కవి దీనంగా. అంతకంటే ఏం చేయగలడు కవి తన ప్రేయసిని?... కాకపోతే ఛడా మడా కథలు, కవిత్వం రాసేస్తాడు తన ప్రేయసి మీద. పైగా ప్రేయసే తన కవిత కాధారమంటాడు....

" అయితే కవికి ప్రేయసేకాని ఇంకేపీ ఆవేశాన్ని కలిగించ లేవా?" అంటే "ప్రేయసితో కూడినవి తప్ప ఇంకేమున్నాయో అసలు చెప్పు" అంటాడు......"ఏం! మూడు రోజుల్నుండీ ఎడతెరపి లేకుండా కురుస్తున్న వర్షం, కవి కేవిధమైన ఆవేశాన్నీ కలుగ జేయలేదా?" అంటే "ఆఎడ తెరిపి లేకుండా కురిసే వర్షంలో కూడ తడుచుకుంటూ నా ప్రేయసి నాదగ్గఅకు వస్తుందనే ఆశ నన్ను నిలువునా కదిల్చి వేస్తుందేమో!"అంటాడు కవి...అయినా నా పిచ్చికాని పిచ్చికవితో నాకు వాదమేమిటి?

## 6

కవిని గురించి పగలు, రాత్రి ఎప్పుడూ కలలు కనను... ఒక్క క్షణం కూడా తనని గురించి ఆలోచించను...కాని ఒక్కొక్క క్షణం కవి తలంపు నిలువ ద్రొక్కుకోలేని ఊపు ఊపేస్తుంది..."అదే ప్రేమం"టాడు కవి...కాదు కవి హృదయాన్ని, కవి ఆవేదనను పూర్తిగా అర్థం చేసుకున్నాను అనుకుంటూ మనసులో నేను...ఏదో మహత్తరశక్తి, అతీత మయింది, మనకు తెలియకుండానే మనను నడిపించేది ఉండి ఉండాలి... లేకపోతే అన్నీ తెలిసుండి కూడా కవి అలా నిస్సహాయుడిగా, ఆవేదనతో వేగిపోతాడా?......

హఠాత్తుగ కవి, నిద్ర కలలో కనిపించాడు-"పెద్ద పెద్ద యిసుక పర్వతాలు...ఎవరో ఆమె, కాళ్ళు ఇసుకలో కూరుకు పోతున్నా నిల దొక్కుకొని, ఆ పెద్ద యిసుక పర్వతం ఎక్కి పోతోంది... ఎవరో కాదు ఆ మూర్తి—కవి ప్రేయసే...కవికి, ఆ మూర్తి నీడలా ఆ పర్వతం ఎక్కి పోవాలని ఆశ...ప్రేయసి అమాయకంగా ఈ సంగతి తెలియకుండానే ఎక్కిపోయి క్రిందికి చూచింది! తనకు కొద్ది దూరంలోనే క్రిందుగా కవి కూరుకు పోతూ చేయి చాస్తున్నాడు......లాభంలేదు. చేయి అందిస్తే తనతో పాటు ప్రేయసిని కూడా ఆ యిసుకలోకి కూర్చే స్తాడు. కవి వెనుకనే ఇంకొక మూర్తి ఎవరో రెండో చేయి పుచ్చుకుని, ఆ ఇసుకలో కవిని కూరుకు పోనీయకుండా క్రిందికి దించేయడానికి వస్తోంది"...అంతే కల తెగిపోయింది...కొన్ని కలలు యదార్థ జీవితాలని ఎంత చక్కగా ప్రతిబింబిస్తాయి!... "నీవు లేందే బ్రతకలేను......ఇంకా ఎన్నాళ్ళో బ్రతకను" అంటాడు కవి..."ఎవరో ఇంకొక ప్రేయసి వస్తుంది...నీకు ఇష్టమున్నా లేకపోయినా అలవాటు పడిపోతావు...ఎప్పటికైనా నీవు పడే బాధకు పశమనమంటూ ఉంటుంది" అంటే "అబ్బా! నాకింక ఓపికలేదు. ఎవరైన ఇక నన్ను వెతుక్కుంటూ రావలసిందే...నే నింకెవర్నీ వెతకలేను...ఎవరోవచ్చి నాకు చేయూత నిచ్చేలోగా నా జీవితం పరిసమాప్త మవుతుం దేమో!!" అంటాడు కవి...అవును; ఇదీ ఒక పెద చిక్కే!...

అబ్బబ్బ! ఈ కవితో మొత్తానికి పిచ్చెక్కి పోతోంది?...కాని కవి లేకపోతే జీవితం మరీ గాడినబడ్డ గానుగలా, నిస్సారంగా తయారవుతుంది. జీవితంలో అశాంతి, ఆవేదనలు కూడ అనిర్వచనీయమైన లేని మాధుర్యాన్ని కలుగజేస్తాయి కాబోలు!!!

## 7

ఖాళీ కుర్చీకి బోసితనం రోజురోజుకీ మరీ ఎక్కువవుతోంది. తన బోసినోటి అనుభవంతో నన్ను ఓదార్చుదామని దాని ప్రయత్నం! కాని సాధ్యమా!!

"పిచ్చికవి అంటే ఎందుకు నీకింత మమత, మమకారమూను? అలాంటి భావాలన్నీ ఒదిలేస్తేనే మనిషి సుఖపడేది. లేకపోతే కుళ్ళి చావడమే నంటుంది" ఖాళీ కుర్చీ. బాగానే ఉంది వేదాంతం మరి! కాని నేను కేవలం సుఖపడదామనే అనుకోవడం లేదుకదూ! యుగాని కొక్కక్షణం సుఖానుభవం కలిగితే అదే ఎక్కువేమొ! ఆ ఒక్కక్షణాన్ని తలచుకొని, తలచుకొని ఆనందపడుతూ, తిరిగి మరోయుగంలో మరోక్షణపు సుఖం కోసం ఎదురుచూస్తూ... అబ్బ! ఎంత అనిర్వచనీయానందం ఎదురు చూపులో, నిరీక్షణలో... బాధ... అదే తమాషా! ఎంత తీయగా ఉంటుం దా బాధ!! సుఖాన్ని అనుభవించడం కంటె ఆలోచించండంలోనె ఉంది ఆనందం. కష్టాన్ని ఆలో

చించడం కంటె అనుభవించడంలోనే ఉంది తేలిక... ఏంత సౌఖ్యం !!

హృదయంలో ప్రేమ పొంగిపొర్లిపోతోంది. ఇక ఎప్పటికీ ఒట్టుపోదేమో ! తోడినకొద్దీ, బాధపడినకొద్దీ, ఎక్కువవుతోంది. భరించలేక బ్రద్దలయిపోతుందేమో గుండె !... 'యుగయుగాలకు 'నేను—నీవులు'–లేవు. మనిద్దరం ఒక్కటే నంటాడు కవి ఎవరో ఒక్కరిని ఇద్దర్నిగా చీల్చేస్తున్నట్లు ! ఎందుకో పిచ్చి కవి కీ ఉలికిపాటు !

కవికి నా తలంపే, నేపథ్యంలో సంగీతంలా ఏ పని చేస్తున్నా, వెన్నంటుతూ ఉంటుందట. ఒక్కొక్కసారి మరీ ముందుకువస్తే చాలా ప్రయాసతో వెనక్కు నెట్టేయాల్సి వస్తుందట ! ఆలోకంలో ఉన్న కవికి ఈ లోకంలో ఉన్న నేను. కాని కరిగి ఇద్దరం ఒక్కటైన మాకు లోకా లడ్డుతాయా ! మా ఏకత్వానికి అడ్డుగా లోకపు చెలియలికట్టలు లేనేలేవు. ఉంటేమాత్రం అవి అడ్డువస్తాయా ? అలౌకికానందానికి అడ్డుపడే మూర్ఖత ఎవరికుంది ?

# 8

నాలుగు గోడలమధ్య మల్లిపూల సౌరభాన్ని ఎగ జిమ్ముతూ వీస్తోంది 'ఫాను' గాలి. ఒకరి ప్రేమ సౌరభాన్ని మరొకరం చవిచూడగలమా ? 'దేహాన్నావరించి ఉన్న సౌర భాన్ని కూడ అనుభవించాలి' అంటాడు కవి. 'దేహానికి సౌర భమే లేదు—లేనిదానికోసం పిచ్చిగా ప్రాకులాడటం దేనికం' టాను నేను. అక్కడే వస్తుంది కవికీ—నాకూ పేచీ !

కవి హృదయాన్ని అర్థం చేసుకోగలను. స్వీకరించ గలను... కాని నా హృదయాన్ని అర్థం కానీయను. హృద యాన్ని ఆవరించుకుని ఉన్న సాలిగూడు గుండా సున్నితంగా, దానికి హాని కలుగకుండా లోనికి చొచ్చుకు రాగలడా కవి ? ఉహు ! అసంభవం. ఆ పని ఎవ్వరూ చేయలేరు. నా అమాయ కపు కవి ఆ పని చేయగలడా ! నా కవిలోని ఆరుతుణాల పాప అమాయకత్వం, మూడేళ్ళపాప మంకుపట్టు. యివే... యివే యిష్టం నాకు.

నుదురుని ఎడంచేత్తో గట్టిగా పట్టుకుని కుడిచేత్తో కవిత్వం వ్రాస్తుండగా నా కవిని చూస్తే ఆనందంతో, ఆవేదనతో కడుపు తరుక్కుపోతుంది. ఆ కాలే నుదుటిమీద నా చల్లని చేయి పెట్టి, రెండోచేత్తో నాకవి ఎడమచేతిని పట్టుకుని స్వప్నవీథుల్లోకి ఎగి రించుకుపోయి, యింకా యింకా కావ్యాలను రాయించాలని



ఉంటుంది కవితో... కాని అలా చేస్తే కవి తన కవిత్వాన్ని మఱచి, వ్రాస్తున్న కుడిచేతిని ముందుకు చాచి నన్ను తన లోకి లాక్కుంటాడేమొ !! ...కవి కెప్పుడూ అందీ అందని దూరంలోనే ఉండి కవ్విస్తూ స్వప్నవీథుల్లోకి, కవితాప్రపంచం లోకి లాక్కుపోతాను. అప్పుడే నాకవి ప్రేమ గీటురాయి రాపిడితోరాటుతేలి సున్నితమైన, అతి సున్నితమైనకవి త్వాన్ని. హృదయాన్ని కదల్చివేసి, పిచ్చెత్తించే కావ్యాలను కల్పి స్తాడు... అమరకవి అవుతాడు.

## 9

కలలు మరీ త్వరగా కరిగిపోవడంలేదు. వాస్తవిక ప్రపం చంలోకి త్వరగా రాలేకపోతున్నాను... చివఱికి నాది కలల బ్రతుకే కాదుకదా !... ఉహు ! నా కలలనుండి, నా కిష్టమైన, ఆత్మీయమైన ఊహాప్రపంచంనుండి లాగేసే బలమైన శక్తులు నా వెన్నంటే ఉంటాయిగా ఎప్పుడూ ! ఆ శక్తులనుండి నేను తప్పించుకోలేను. అదే జీవితంలోని పెద్ద ఘర్షణ. ఈ ఘర్షణకు ఎంతవఱకు తాళుకోగలను ? తప్పనిసరిగా ఆ శక్తులకు తల ఒగ్గవలసిందే ! కాదని ఆ సుందరతర తటాకంలోనే జీవితమంతా మున్కలు వేయగలనా ? ఉక్కిరిబిక్కిరి కానూ ?

కవి ఏమంటాడు నా యీపిచ్చి ఊహాలకు ? "నిన్ను వెనక్కులాగే భయంకర ఉన్మాద శక్తులు నీవు కల్పించుకున్న వేగా ! నీకు నీవే, నీ నీడకు నీవే భయపడుతున్నావ్ ! దానో హం చేసుకుంటున్నావ్ ! లొంగిపోతున్నావ్ ! అదే పిరికితనం. వాటిని ఎదర్చగల శక్తిఉండికూడ, లేనిదానిలాగ నిస్పృహాగా జీవిస్తావెందుకు ?" అంటాడు కవి పెద్ద ధైర్యంతో.

పిచ్చి కవికి అర్థంకాదు నా అయోమయస్థితి, బాధ. కవి తనను తాను నాకు సంపూర్ణంగా అర్పించుకున్నా, నే నెంత వఱకు నన్ను నేను తనకు అర్పించుకోగలను, ఎలా ఆరాధించ గలను ! నా కవికి ఆరాధన తెలియదు. నాకు సమర్పణ తెలి యదు. నా ఆరాధన, తన సమర్పణ - ఈ రెంటి కలయికా అలౌకికం కదూ ! అంతకంటే యింకేంకావాలి !!

## 10

అబ్బ ! కలే వాస్తవమో, వాస్తవమే కలో తెలియడం లేదు. నా ఎదుటి బోసికుర్చీ మరీ అంతస్థిమితంగా నన్ను చూస్తోందే ! "నీవు కవి కళ్ళల్లోకి నిశ్చలంగా ఎందుకు చూడవ్? ఇష్టంలేకా ? చూడలేకా ?... ఓ ! ఊహాలతో వేడెక్కి, ఎట్టి నైన కవికళ్ళల్లోని లోతుచూపుల తాకిడికి, రాపిడికి తాళుకో లేని బేలతనమేమో !" అంటోంది ఖాళీకుర్చీ. "ప్రతిక్షణం

జీవించు, ప్రతిక్షణాన్ని నూతనంగా అనుభవించు, ఆ అనుభవ జ్ఞానంతో, కవితో కావ్యాలల్లించి అమరత్వం పొందించు. పిచ్చి దానా! కవి వేరూ, నీవు వేరూనా? కావ్యవస్తువువి నీవు, కావ్యకర్త కవి. ఒకరులేందే మరొకరులేరు. ఇద్దరూ ఉంటారు ఎప్పటికీ. అన్నిచోట్లా యుగాంతంలో, యుగారంభంలో, రసావేశంలో, దుర్భరఆవేదనలో, అయోమయంలో అన్నింటిలో.నీకు తెలియదా ఆసంగతి?...నిజమే నీకు తెలిసేఅవకాశం, అనుభవం ఏవీ? కాని అది కవికి తెలుసు. నీకు తెలియకుండానే నిన్ను కవి తనలో కలిపేసుకున్నాడు ఊహల్లో, కలల్లో! నీ చుట్టూ ఆ ముసుగు నెందుకు కల్పించుకుంటావ్! ఆ ముసుగులోనుంచి నిన్నెవ్వరూ చూడలేరని నీ ధీమా! నిన్నెవ్వరూ గుర్తించరని నీ నమ్మకం! నిన్నెవ్వరూ అందుకోలేరని నీ గర్వం!... ముసుగులో కళ్ళు మూసుకున్నావు నీవు. ముసుగు వెలుపల కవి తన లోతైన వాడిచూపులతో నిన్ను తనలోకి లాగేసుకున్న సంగతి నీకింకా తెలియలేదు. కళ్ళు తెరువు" అంటోంది నా ఎదుటి కుర్చీ యుగయుగాల అనుభవంతో.

## 11

నా కవీ! ఒక్క సంగతి చెప్పనా నీకు? "నా మాటని, ఉద్దేశ్యాన్ని వెంటనే అర్థం చేసుకోలేవు నీవు" అని బోసికుర్చీ విమర్శించింది నన్ను. పెదాలు చిన్నగా కదిలాయి నవ్వుతో,

అదే నా సమాధానం ఆ విమర్శకు. ఆరేళ్ళ అమాయకపు పిల్లాడు నా ఒళ్ళో తలబెట్టుకు కథ వింటూ, నేనంటే తనకెంత యిష్టమో తెలియచెప్పడానికి, చటుక్కున "నిన్ను పెళ్ళిచేసుకుంటాను" అన్నాడు. "ఏడిశావ్ పిచ్చివెధవా"? అన్న వాళ్ళమ్మ మాటలు, ఒక ప్రేమపూరిత నిర్మల హృదయాన్ని పొందకలిగాననే ఆనందంతో పిల్లవాడిని గుండెకు హత్తుకుని, చిక్కుపడ్డ జుట్టును విడదీస్తున్న నాకు ఎందుకు వినపడ్డాయాఅని బాధపడ్డాను. అప్పుడు అక్కడేఉన్న మరో పెద్దవ్యక్తి, ఆ మరుచటిరోజు, క్రితంరోజు పిల్లవానికున్న ధైర్యం తనకు లేకపోయిందని పరోక్షంగా వాపోయినప్పుడు అర్ధం కానట్లే, విననట్లే ప్రవర్తించాను. దాని ప్రతిమాటనీ, ఉద్దేశ్యాన్నీ అర్థం చేసుకున్నట్లుగా ప్రవర్తించి, బోసికుర్చీతో వాదించే శక్తీ, యిష్టమూకూడ నాలోలేవు. ఏమంటావు కవీ! అలాంటప్పుడు అర్థం కానట్టుగా, ఏమి తెలియని పసిపాపలా, అమాయకంగా విని ఊరుకుంటే మంచిదికదూ! నిర్మల సరోవరపు అఖాతాలను అందరూ గుర్తించగలరా? కదూ! నీ వొక్కడివే... నీ వొక్కడివే గుర్తించగలవు. అందుకే నీకూ—అందరికీమధ్య అంత తేడా!!

## 12

కవీ ! ఎక్కడున్నావ్ ? ఏంచేస్తున్నావ్ ? ఆ కనపడే నక్షత్రింలోని మినుకు మినుకులు నీ కళ్ళేనా ? అవి నాకోసమే తపనతో చూస్తున్నాయని నాకు తెలుసు. కవీ రెక్కలు కట్టుకు నీదగ్గఱ వాలనా ? నా పిచ్చికాని నా కా శక్తేది ?... నీవెవ్వరవు కవీ అసలు ? నీలాంటివాళ్ళనేనా దేవతలూ, దేవుళ్ళూ అంటారు ? చూస్తే నీవేమొ చులాగ్గా "నీవాడనే" నంటావ్ !... పిచ్చికవీ ! నీకూ నాకూ ఎంత తారతమ్యం ఉంది. నీకు చావులేదు. నే నే క్షణానికి చచ్చిపోతానో తెలియదు. నాతో ఎందుకు స్నేహం చేస్తావ్ ? నేను చచ్చిపోతే మళ్ళీ బాధపడతావ్ ? నీ ఆ బాధను తలుచుకుంటే నీకోసం మృత్యువును జయించి ఎల్లకాలం బ్రతికే ఉండాలని ఉంటుంది.

ఎంత నిస్వార్థత నీది ! నీదైవత్వాన్ని నాకుకూడ పంచియిస్తున్నావు కదూ ! నన్ను నీ కావ్యాలలో జీవింపచేసి అమరత్వాన్ని ప్రసాదిస్తున్నావ్‌కదూ నాకు !... ఎంత స్వార్థం నాది!! నన్ను నీకు సమర్పించుకోలేను. నిన్ను ఆవేదనలో వేగిస్తున్నాను. నీ ఆ చిన్ని నిండు కళ్ళల్లో జలపాతాలను సృష్టిస్తున్నాను. నీ హృదయంలో అగ్నిపర్వతాలను కల్పిస్తున్నాను. నీ రక్తాన్ని నీరుగా మారుస్తున్నాను కవీ ! నన్ను క్షమించవద్దు ! నన్నుగురించి కావ్యాలల్లకు...ఏంచేయను నేను కవీ!...

అయినా నీవు నన్ను కసిగా తిడతావ్. మర్చిపోవు. ప్రతిక్షణం నన్నుగురించే ఆలోచిస్తావ్! నీ కావ్యాలలో నాకు జీవం పోస్తావ్? కవీ! నీ పాదాలను నా కన్నీటితో కడిగి కరిగి పోవాలనుంది. కృతజ్ఞతతో, జాలితో, ఆవేదనతో గుండె పగిలి పోతోంది! నాకు సాయంచేయకు కవీ! నన్నిలాగే బాధపడనీ? కృశించనీ !! చచ్చిపోనీ !!!

## 13

కవీ! ఎప్పుడూ మండువేసవే ఉండాలి. శీతాకాలంలో, వర్షాకాలంలో కాళ్ళు ముడుచుకుంటావ్! నీ పాదాలు నా కందవ్! వేసవిలో కాళ్ళు చాస్తావ్! నాకేసి చాస్తావ్! ఆ పాదాలను నా హృదయాని కద్దుకుంటాను... నీకు తెలియ కుండానే...

బోసికుర్చీ అంటోంది "ఏమిటలా జీవంలేనట్లుగా చూస్తూ కూర్చుంటావ్! నీ పిచ్చికవి మరీ పిచ్చివాడై పోతున్నాడూ" అని ఏం! వెఱ్ఱివాడివై పోతున్నావా? ఒద్దు! జుట్టు పీక్కోకు! నుదురు కొట్టుకోకు! వద్దు! ఆ కళ్ళల్లో నీళ్ళు నింపకు! నా వెఱ్ఱి కవీ! "నా గుండెల్లో ముఖం దాచుకుని పిచ్చిగా తలను రాస్తూ, కన్నీటి ప్రవాహానికి అడ్డు కట్టకుండా ఏడ్చేయాలని ఉంది" అంటావ్! కన్నీటితో నా పవిటనూ, రవి



కనూ, నా పాషాణహృదయాన్ని తడిపి కరిగించేస్తానంటావ్ ! నాకు తెలుసు నీకాశక్తి ఉంది. అందుకేకదూ నేను ముసుగులో, నీకు దూరదూరంగా ఉంటాను. కవీ, త్వరలో నే ఆ ముసుగులోని నేను హరించుకుపోతాను ఇంకా దానిలోనే ఉన్నాననుకుని భ్రమపడి దానిచుట్టూ తిరుగుతూ ఉంటావ్ !... అబ్బ ! ఏడవకు నా పిచ్చికవీ ! నన్ను తిట్టు, శపించు... కాని నీ కన్నీళ్ళనుమాత్రం నేను చూడలేను. "ఆవేదనతో, వేడితో తలమీద జుట్టురాలిపోతోంది. కళ్ళు పేలిపోతున్నాయి, పెదాలు మాడిపోతున్నాయి" అంటావెందుకు కవీ ! నన్ను నిలువునా చీల్చేస్తున్నావ్ ! కాల్చేస్తున్నావ్ కవీ ! నన్ను పాషాణాని వంటావు, మరినీవో అంతకుమించే ఉన్నావ్ !... కవీ ! ఏమీ అనుకోకు నిన్నలా అన్నానని. మరి ఎందుకలాంటి మాట లంటావ్ ? హద్దులులేని నా ఓపికకు, నా అఖాతహృదయానికి హద్దులు కల్పిస్తున్నావంతే నీపిచ్చి మాటలతో.

"నాకవీ—నాకవీ"అని కోట్లసార్లు అనుకున్నా, కోటాను కోట్లసార్లు జపించినా తనివి తీరడంలేదు. నాకవీ ! నేను భౌతికంగా బ్రతికి ఉన్నానన్నమాట మర్చి పో! నీ పిచ్చికాని నిజంగా నేను బ్రతికిలేను కూడా !!



## 14

గుక్కతిప్పుకున్నాను కవీ! కళ్ళు తుడుచుకో!......
పిచ్చికవీ! నా కొంగే కావాలా నీకళ్ళు తుడుచుకోవడానికి ?
ఆ కొంగుతోపాటు ఎక్కడ నన్ను నీలోకి లాక్కుంటావోనని
భయం...... "నన్ను వెంటాడవద్దు" అని అన్నానా నేను
నిన్ను ? నిన్నాపగల శక్తి, హక్కు ఎవరికున్నాయ్? నన్ను
వెంటాడు. కాని నన్ను పట్టుకుని నీలో కలుపుకోవడానికి
ప్రయత్నించకు.

అబ్బ! నీకెలా చెప్పను ? నీవుకూడా నటించడం నేర్చు
కున్నావా ? లేకపోతే నిజంగానే నా మాటలు నీ కర్థంకావడం
లేదా ?... నన్ను నీలో కలుపుకున్న మత్తులో నీవు కావ్యా
లేం అల్లుతావ్ ? నీవు కావ్యా లల్లడానికే అవతరించావ్. ఆ
కావ్యాలని నీచేత వ్రాయించడానికే నేను పుట్టాను. ఆ కావ్యా
లను వదిలి నన్ను పట్టుకుంటానంటావేమిటి ? అందుకే నిన్ను
"వెఱ్ఱివాడి వంటాను" నేను అది విని పైగా "నీవే నన్నలా
తయారుచేశావ్!" అంటావ్. అంత మరీ పసిపాపవై పోతా
వెందుకు నాదగ్గఱ? నిస్సహాయంగా ఏడుస్తావ్ ! కసిగా
గల్లంతు చేస్తావ్ !...

కవీ! అంత నిర్మలంగా ఉంటుందే నీ హృదయం ! ఎందు
కలా గంటున్నానో తెలుసా నీకు ? అంతదూరంలో కూడ నా

బొమ్మ, నా ప్రతిబింబం నీ హృదయంలో కనపడుతోంది. ఎంత ధన్యమైంది నా ప్రతిబింబం !!!

## 15

నా పిచ్చికవీ ఏంచేస్తున్నావ్ ? నిద్రపోతున్నావా ? బోసి కుర్చీ అనుకుంటుంది అలానని... కాని నీవు నిద్రపోగలవా !... ఉహు ! పోవు నన్నుగురించే ఆలోచిస్తున్నావ్ కదూ !...... అదుగో నుదురు పట్టుకులేచావ్ ! ఏదో అల్లుతావ్ నామీద. అదుగో ఆ తెల్లకాగితం బల్లమీద నీకోసం ఎలా ఆతృతతో చూస్తోందో !...... ఆ తెల్లటి శరీరంమీద భావాల లతలుగీసి, అక్షరాల పూవులు, పిందెలు చిత్రిస్తున్నావుకదూ!... ఆవేశంతో నుదురు వేడెక్కిందా తల నలా వెనక్కువాల్చావ్ ? నీ నుదుటి వేడిని నా పెదవులు పీలుస్తున్నట్టుగా కలగంటున్నావా ! నీ కాలే నుదురుమీద నా చల్లని అరచేయి పఱచుకొని ఉందేమో నని తడుముకొంటున్నావా నీ చేతితో ?...... ఆ తెరచిన కళ్ళల్లో ఏమిటా రక్తపుజీర ? పిచ్చిగా, సూటిగా చూచే నీ చూపులు నా హృదయంలో నాటుకుపోతున్నాయ్. దూసుకు బయటకు పోవేం ?... "ఎలా పోతాయ్ ? అదే వాటి గమ్యస్థానం. నీవే నా పరమావధివి" అంటావ్. "నిన్ను వెదుక్కోగలిగాను. కాని సమీపించలేక పోతున్నాను. ఎన్ని జన్మల

నుండి నీకోసం వెతుకుతున్నాను! ఈ జన్మలో నీవు కన పడ్డావ్! నీలో ఐక్యమవడానికి ఇంకా ఎన్ని జన్మలెత్తాలి?... లోన ఏడుస్తూ, కుమిలిపోతూ, పైకలా గంభీరంగా నవ్వుముఖం పెడతావెందుకు? నీ హృదయాన్ని చూడగలను నీవెన్ని ముసుగులు వేసుకున్నా కాని నన్ను అనుభవించ నీయ వెందుకు?" అంటావ్ పెద్ద ఉపన్యాస ధోరణిలో. ఆవేశంతో అలసిపోయి ఏడుస్తావెందుకు? నా కొంగు నారనియ్యవా? నాకొంగు నందుకుని ముఖం కప్పుకుని దాని చాటున నీ ఏడు పును దాచుకొంటున్నావా నా పిచ్చికవీ! 'నేనే ఏడ్చి నేనే కళ్ళు తుడుచుకోవాలా?' అనుకుంటున్నావుకదూ! అక్కర్లేదు. నేనే నీవైపుకు తిరిగి తుడుస్తాను. కాని ఒక్కటే భయం అలా చేస్తే అస్తమానం ఏడుస్తావని...... అబ్బా! నీ చెక్కిళ్ళమీద కన్నీళ్ళు అలా పొగలు జిమ్ముతున్నాయే?... ఏదీ నీ తల! నా హృదయానికి హత్తుకుంటాను! నీ తలను బీటవార నీయను!... గుక్కతిప్పుకో! సంతోషంతో ఉక్కిరి బిక్కిరవు తున్నావా? పిచ్చికవీ! నీదంతా విపరీతం. ఎంత తన్మయత్వం చెందుతావు కవీ నీవు! అప్పుడు నీ మూర్తి కన్నూ, నోరూ విప్పని పసికందులా ఉంటుంది" 'నీవు చచ్చిపోయేటప్పుడు నీ తలను నా హృదయానికి హత్తుకుంటా'నని ఒక్కసారి అను. ఈ క్షణంలో ప్రాణాలు ఒదుల్తాను ఆ అనుభవంకోసం"అంటావ్. నా కవీ నీవింత అమాయకుడివే! లోకంలో అందరిముందు

అంత మేధావివి! గొప్పవాడివి! నా ముందే ఇంత పిచ్చి వాడిలా మారిపోతా వెందుకు? "పిచ్చివాడు అందరిముందూ పిచ్చివాడే. కవి ఒక్క ప్రేయసిముందే పిచ్చివాడు" అంటు న్నావా? అయితే ప్రేయసి కవిముందు ఏమవుతుంది?

## 16

కవీ! ఏంచేస్తున్నావ్?......నన్నుగురించి ఆలోచిస్తు న్నావా? అది నాకు తెలుసులే. నన్నుగురించి తప్ప ఇంకొక ళ్ళనుగురించి ఆలోచించడానికి నీకు వ్యవధి ఏదీ?... నేనూ నిన్ను గురించి ఆలోచిస్తాను...బోసి కుర్చీకూడా నీలాంటిదే నను కుంటాను. అన్ని లోకాలలో ప్రేమ; ఆవేదనలో ఆనందం; అమాయకత్వం; అసహాయత్వం; జాలీ; సానుభూతీ; కృతజ్ఞతా, నిరాశలో ఆశా; అసంతృప్తిలో తృప్తి ఇవన్నీ నీవే!...... అందుకనే కవీ నిన్నుగురించే ఆలోచిస్తాను...నిన్ను నాలో జీర్ణింపచేసుకుంటాను...పిచ్చికవీ! నిన్నుగురించే నీకు తెలియదు. నీ ప్రేయసి కవివనిమాత్రమే నీకు తెలుసు... ఆ ప్రేయసిని కూడ అందుకోలేని కవి ననుకుంటావ్. ఆ ప్రేయసి నిన్ను తనలో కలుపుకోకముందే నీ జీవితం పరిసమాప్తమౌతుందంటావ్! నీ పిచ్చి వాగుడు విని నేను నవ్వితే "నీవు నవ్వగలవుకూడానా నీ కవి క్రుమ్మగిపోతుంటేనూ!" అని వాపోతావ్...నీ పిచ్చి తనానికి నవ్వక ఏంచేయను?

"నీకు చావులేదు. నీవు అమరుడివి. నీ ప్రేయసికికూడా నీ అమరత్వాన్ని పంచియిచ్చావ్! నీవు ఏ లోకంలో, ఏ యుగంలో ఊసరవిల్లిలా ఎలాంటి రంగులు మార్చుకున్నా, నీ ప్రేయసి నిన్ను గుర్తించి, ఊహించుకుంటూ, చూస్తూ, జీర్ణింప చేసుకుంటూ ఆరాధించగలదు" అని నేనంటే, నా మాటలు నీ కర్థంకానట్టుగా తెల్లబోయి పసిపాపవై పోతావ్...కళ్ళవెంట నీరు అమృతధారలుగా కారిపోతూఉండగా "నిన్నెలా అర్థం చేసుకోగలను? నిన్నెలా సమీపించగలను? నీలో ఎలా ఐక్యమవ గలను? నీకోసమే ఇన్ని జన్మలెత్తుతున్నాను. ఇంకా ఎన్ని జన్మ లెత్తాలి?...నీముందు నే నెంతో తేలికై పోతాను. మేరుపర్వ తానిని తాకిన పిల్లతెమ్మెరలా అయిపోతాను" అంటావ్... పిచ్చికవీ! ఒక్కటినిజం. నీకు నే నెప్పుడూ విడివడని సమస్యనే... నీకే కాదు, బోసి కుర్చీకికూడా. కాని నీకూ, బోసికుర్చీకి ఒక్కటే తేడావుంది. నీవు నాకు ఏ ఒక రూపాన్నీ కల్పించ డానికీ సాహసించవు. అశక్తుడనని బాధపడతావ్...కాని బోసి కుర్చీ నాకొక రూపాన్నిద్దామని. ఆ రూపంలో కొన్ని గుణా లని, రసాలని రూపొందించుదామని ప్రయత్నిస్తుంది. తమాషా ఏమిటంటే ఆ బోసి కుర్చీలోకూడా నిన్ను చూడగలుగుతాను నేను!



## 17

పిచ్చికవీ ! ఎందుకలా ప్రార్థిస్తావ్...నా దగ్గిఅంత మరీ గా, పిచ్చిగా ప్రవర్తిస్తావే? నీ వెఱ్ఱితనాన్ని, పిచ్చితనాన్ని, ాయకత్వాన్ని నే నొక్కదాన్నే అర్థంచేసుకొని, భరించ గేదాన్ననికాబోలు !... "నా నిజస్వరూపమే అది" ావు పెద్ద నీకే మహా తెలుసు నిన్నుగురించి అన్నట్లు... ఱు ఎక్కువ నాకే తెలుసు నిన్నుగురించి.

"నీ జీవన ప్రవాహానికి ఆనకట్టకట్టి, చిన్న కాలువ ా నీ జీవసారాన్ని బీడుపడి, బీటవారిన నా జీవితమైదా ో ఇంకింపజేసికొని కావ్యాలను వ్రాయిస్తాను. సాహి న్ని పండిస్తాను" అంటావ్. నా కవీ! నిన్ను ఊరికే పిచ్చి ంటాననుకున్నావా? నా జీవన ప్రవాహ ప్రసారానికి దూ మూలం! నీవే లేకపోతే నా జీవన ప్రవాహం ిలా ప్రసరిస్తుంది? ఎండిపోతుందికదూ!!

## 18

నా ఎదుటి బోసి కుర్చీ అంటోంది "ఎందుకలా అర్థం ండా ఉంటావ్, అర్థం కాకుండా మాట్లాడుతావూ"అని. పీ! నీవూ ఆలాగే అంటావు... మీ పొరపాట్లను నామీద రుద్దుతున్నారంతే. బోసి కుర్చీ నన్నర్థం చేసుకోలేక, సరిగా

అర్థం చేసుకోవడానికి ప్రయత్నించక, తన అశక్తతకు నా మీద ఈర్ష్యపడి నన్నేదో బాధ పెడదామనుకుంటుంది... పిచ్చి కుర్చీకి తెలియదు అదంటే నా కెంతజాలో! సానుభూతో!!... నన్నేమిటో బాధించి, సాధిద్దామని దాని ప్రయత్నం...... కాని నాలో ఏముంది బోసి కుర్చీ సాధించేటందుకు ?...... "నీవ్వీ అలాగే అంటావుకదూ!" అన్నానని 'నన్నూ, బోసి కుర్చీని ఒకచేనంది, అనుకుని "బాధ పడుతున్నావా కవీ ? నిన్ను, నీ శక్తిని పూర్తిగా అర్థం చేసుకోగలిగిన దానిని నే నొక్కదాన్నేనని తెలిసికూడా అప్పుడప్పుడు అలా ఉలిక్కి పడతావెందుకు ?... నాలో దేనినో సాధిద్దామనుకోవు నీవు. నన్నే సంపూర్ణంగా సాధించి నీలో అంతర్గతం చేసుకుందామను కుంటావు, నీ అశక్తతకు నామీద ఈర్ష్య పడవు బోసి కుర్చీలా. విరుచుకు పడతావు స్వశక్తితో నిలబడలేనట్లుగా! తిడతావు కచ్చిగా నిరాశతో. అంతేగాని శపించవు కోపంతో. చెట్టుకొమ్మ నుండి వేలాడుతూఉన్న మామిడిపండు తన మీద దయతలచి తన చేతిలోకి పడదేమాఅని పిల్లవాడు విసుక్కున్నట్టుగా, తిట్టు కున్నట్టుగా, వెట్టికోపాన్ని కన్నీళ్ళుగా మార్చుకుంటూ గమిస్తు న్నావు కవీ నీవు.

నా కవీ! ఊరకే ఉలికిపడకు. బెంగపడకు. "ఉహు! భయపడను. నీవున్నావుగా నాకు" అంటున్నావు కదూ! అవును కవీ... నేను నీకున్నాను. కాని నా కెవరున్నారు?...

నా కెవరూ అక్కర్లేదు. ఏదీ అక్కర్లేదు; అంతా కావాలి, అందరూ కావాలి. "అయితే నే నేమీ కానా నీకు? నే నక్కర్లేదా?" అంటున్నావు కదూ! ఆ బిక్కముఖం మానేయ్! అంతా నీవే—అందరూ నీవే... నా కవివే కదూ!... అబ్బ! ఎలా నీతో! ఎంత విడమర్చి చెప్పినా అర్థంకాదే నీకు! .. ఇంతలో ఏడ్పు, ఇంతలో నవ్వు. నా కొంగు ఉందిగా నీ ఏడ్పును దాచడానికి, తనలో యింకింప జేసుకోవటానికి. ఆ నీ నవ్వును బోసి కుర్చీని అనుభవించనీయి. నీ ఆవేదనను, ఏడ్పును చూచి బోసి కుర్చీ బేజారెత్తుతుందనే, నా కొంగు వాటిని దాచేసి, పీల్చేస్తుంది.

## 19

కవీ!—బోసి కుర్చీ, నీవు, నా చుట్టూ ఉత్సాహంతో, సంతోషంతో, ఆశయాలతో, కోర్కెలతో పరవళ్ళు త్రొక్కుతున్నారు... నా చిన్న హృదయం మీ సంతోషాన్ని, ఉత్సాహాన్ని చూచి చిరునవ్వులు చిందిస్తూ ఉంది నిండు కుండలా. ఏ మహత్తర సంఘటనైనా దానిని అమితోత్సాహంతో, అసూయతో, అనురాగంతో ఢీకొన్నా అది ఏ కొంచెం కూడా చలించదే? తననిగురించి తన కెందుకో ఈ స్తబ్ధత!... ఇక దానిలో మార్పులకు తావులేదు. కోర్కెలు, ఆశయాలు,

కీర్తి, ధనం అనే మందులను దాని గొంతు పెకిలించి పోయలేరు. నరాలలో ఎక్కించలేరు. నేను నీ కేదో దానిని గురించి చెపుతున్నానని దానికెంత నవ్వుగా ఉందో లోపల! పైకి "ఏమిటో అంత వెఱ్ఱితనం?" అని జాలిపడుతోంది.

కవీ! ఒక్కదానికి సమాధానం చెప్పగలవా? నన్ను బోసి కుర్చీ ప్రేమిస్తుంది. అనురాగంతో చూస్తుంది. అసూయ పడుతుంది... ఇవన్నీ నేను ఒద్దన్నా చేస్తున్నప్పుడు, నన్ను సరిగా అర్థం చేసుకోవడానికి ఎందుకు ప్రయత్నించదు? అశక్తతా లేక అయిష్టతా?

## 20

"నన్ను గురించి ఏవిధంగానూ ఆలోచించవద్దు, నా కే రూపమూ కల్పించవద్దు" అంటే మంకుపట్టుపట్టి "పోనీ నీ రూపం ఏదో, నీ వెవరివో" చెప్పమంటావు. నీ బాధపడలేక చెబితే, నిజంగా అర్థమేకాదో, సరిగ్గా అర్థంచేసుకోవడానికి యిష్టమేలేదో, లేక అర్థమైనా అర్థంకానట్టు నటిస్తావో కాని, అప్పుడు విభ్రాంతిలో పడి ఉన్న నీ ముఖాన్ని నా గుండెల్లో దాచుకొని రక్షించాలని ఉంటుంది...నే నెవర్నో నీకైనా చెప్పడం నా కిష్టం అనుకుంటున్నావేమో! ఏముంది చెప్పడానికి? నేను ప్రళయంలో, తుఫానులో ఏం బాధలుపడతానో

నని వేదనపడతావు నన్నుగురించి...కాని కవీ! ఎలాంటి పెను తుఫానులలోనూ నన్నుగురించి నే నెప్పుడూ చలించను... కాని చిన్న పిల్లగాలులకుకూడ పర్వతాలు, మహా వృక్షాలు, బోసి కుర్చీ, నీవు అందరూ ఎంత బాధపడుతున్నారోనని దిగులు పడతాను. అలాంటి సమయాల్లో అందర్నీ, ఎవరికీ తెలియకుండా నాలో ఇమిడ్చేసుకుని రక్షించాలని ఉంటుంది...ఛా! ఏమిటా ఏడుపు కవీ! నన్నర్థం చేసుకోలేక ఇంకా పైగా ఇదొకటా? మాటిమాటికీ ఏడుస్తావు. ఇదుగో నా కొంగు... నాకు తెలుసు. అందుకనే ఎప్పుడూ స్తబ్ధుగా ఉండిపోతాను. నీకేమీ చెప్పను. మరి నీవు మారాముపెట్టి నాచేత ఏమి టేమిటో చెప్పిస్తావ్. ఆ చెప్పినది అర్థంకాక అశక్తతతో ఆరాధిస్తావ్... ఏడుస్తావ్. మళ్ళీ ఆ అశక్తతలోనే ఎంత ధీమా నీకు, "నా అశక్తతను తన హృదయంతో కప్పివేస్తుందిగా నా ప్రేయసీ" అని!!

## 21

పిచ్చికవీ! ఎన్ని జన్మలెత్తినా, ఎన్ని యుగాలు నీవు నీ ప్రేయసిలో లీనమై జీవించినా, జీర్ణించినా, నీ ప్రేయసి నీకెప్పుడూ అగమ్యగోచరమే. ఒక క్షణం ఆరాధనతో, పూజ్యభావంతో, భక్తితో "నా ప్రేయసి దేవత" అనుకుంటావు. మరుక్షణమే అర్థంకాని నీ ప్రేయసిని చూచి నీ అల్పత్వానికి

నీవే చికాకుపడి "నా ప్రేంగుసి శూన్యం. రూపరహితం" అనుకుంటావు...కవీ! నీవు ఆరాధనలో నన్ను దేవతవన్నా నాలో ఏ విధమైన మార్పూ ఉండదు. కచ్చిగా నన్ను రాక్షసివి అన్నా నాలో ఏ విధమైన మార్పూ ఉండదు. కవీ! పదేపదే ఎన్నిసార్లు చెప్పనూ నీతో నాలో చైతన్యంలేదని! "మరి నీ వెవరవు" అని ప్రశ్నిస్తూంది బోసి కుర్చీ...కాని నా సమాధాన మెవరికిస్తానో తెలుసా?... బోసికుర్చీకి కాదు...నీకు...నీకు మాత్రమే. "బోసి కుర్చీ ఏదో ప్రశ్న అడిగితే నీవు నాకు సమాధానం చెబుతానంటావేమిటి?" అంటున్నావుకదూ నా కవీ! అదే జీవిత రహస్యం!

## 22

కవీ! ఒక్కటడుగుతాను చెప్పు! బ్రతుకుకి జీవించడమే ఆశయమా?...ఏం అదొక్కటేకాని చచ్చిపోవడం ఆశయం కాదూ?..."మరణం జీవితానికి గమ్యస్థానం, ఆశయం కాదం" టావ్. ఏమిటో కవీ! నీవు అన్నింటినీ వేరువేరుచేస్తావు. చీల్చేస్తావు. చివఱకు నన్నూ, నిన్నూకూడ చీల్చేసుకున్నటుగా, వేఱుపఱచుకున్నట్టుగా ఉలికిపడతావు...నేనేదో నిన్ను ప్రశ్న అడిగితే దానికి సమాధానం నేను కోరుతున్నాననా అర్థం ... కాదు. నా జీవితమే, అందులోని ప్రేమ, ఆవేదన, అశాంతి,

బాధ, ఆనందం ఇవే నీముందు ప్రశ్నల రూపంలో సాక్షాత్కరిస్తాయి. "అయితే నీ ఆశయం ఏమిటో చెప్పుమరి" అని అడుగుతున్నావుకదూ కవీ? ..ఒకసారి అన్నాను గుర్తుందా, బోసి కుర్చీ "నీ వెవరవు" అని నన్ను ప్రశ్నించిందనీ.... ఆ ప్రశ్నకు సమాధానం "నీకే చెబుతాను" అని నీతో అన్నాననీ... "నిన్నంతా నాలో జీర్ణింపచేసుకున్నానే! ఇంకా అదిగుర్తుందా, ఇది గుర్తుందా అని అడుగుతావెందుకు?" అని వాపోతున్నావు కదూ కవీ! లేదు నా పిచ్చికవీ! నీ జీవితమే నేను. నీ ఆశయమే నేనని తెలుసు...ఇంతకీ ఆ ప్రశ్నకు సమాధానం చెప్పనా? నేను నేనే. 'దేవత' ను అనుకుంటే దేవతగా నన్ను ఊహించుకుంటున్నావంతే. 'రాక్షసి' అనుకున్నా అదీ నీ ఊహే. "నేనంటే ఎవరు?" అని అడుగుతున్నావుకదూ! నేనంటే ఒక సూక్ష్మాతిసూక్ష్మమైన రేణువును మాత్రమే. ఆ రేణువుకు రేణువుగానే ఉండటం ఇష్టం. ఆ రేణువును, అందరూ దానిని గుర్తించకుండానే నలిపివేయాలి...అది సహజం. "ఇలా నిర్దాక్షిణ్యంగా, కసిగా నలిపివేశామే ఆ అనామక రేణువునీ" అని ఎవరూ జాలిపడనూ అక్ఖర్లేదు, సంతోషించనూ అక్ఖర్లేదు. ఆ రేణువుకూడా, అందరూ తనని ప్రేమతో, క్రోధంతో నలిపివేశారే అని సంతోషపడదూ, కోపపడదూ...తనకొక కోరిక కాని, ఆశయంకాని, గమ్యస్థానంకాని ఏమీ లేవు. "ఇక తనెలా జీవిస్తుందీ" అంటున్నావుకదూ! కవీ! 'పుట్టటం; జీవించడం;

చచ్చిపోవడం' ఈ మూడింటినీ వేరువేరుగా విభజిస్తుంది బోసి కుర్చీ. రేణువుకు ఈ మూడూ ఒక్కటే...ఏమీ లేదు కవీ... ఏమీ లేదు. ఇప్పుడు తెలిసిందికదూ నే నెవర్నో!

## 23

"కవీ! ఏం చేస్తున్నావ్?" అని నిన్నడగటం లేదిప్పుడు. "కవీ! నేనిది చెబుతున్నాను. వినితీరవలసిందే. తప్పదు" అని రోదిస్తున్నాను కవీ! తల్లిలా నిన్ను నా కొంగుచాటున దాచుకుందామనుకునే నేను, ఏ యుగానికో ఒక్క క్షణమైనా నీలో పసిపాపనై ఇమిడిపోవాలని ఉంటుంది. తల్లిలా నిన్ను నాలో దాచుకున్న క్షణం, పసిపాపలా నేను నీలో ఇమిడిపోయిన క్షణమూ—ఈ రెండు క్షణాలు మాత్రమే నేను నేను. అదే నా జీవితం...కాని కవీ! యుగానికో రెండు క్షణాలు శాంతిని అనుభవించడానికికూడా నోచుకోలేదు నేను... ఆ రెండు క్షణాల్లో బోసికుర్చీ నా కెక్కడ గుర్తుంటుంది? కాని "నేను ఉన్నాను. ఎప్పటికీ ఉంటాను నిన్ను పరీక్షచేస్తూ. నీవు తన్మయత్వంచెందిన ఆ రెండు క్షణాల్లోకూడా "నీకు తన్మయత్వం తగదు. నన్ను గుర్తుంచుకోవాలి తప్పదు. తన్మయత్వంనుండి, శాంతి సమాధినుండి లేవగలిగే శక్తి నీకు లేదు. అందుకే నిన్ను తన్మయత్వం చెందనీయను. నిన్ను శాంతి సమాధిని చేరుకో

నీయను ఒక్క క్షణమైనా. ఒకవేళ చేరుకున్నా, అన్నివి తబ్బిబ్బుజేసి; ఇరుకునపెట్టి నిన్ను నా దగ్గఱకు లాగే టాను" అంటోంది బోసి కుర్చీ.

కవీ! విన్నావుగా నా పరిస్థితి నా నరాలు రో కుమిలిపోతూ చెబుతూఉంటే... నా నరాలనుపిండి, పీల్చి చేస్తున్న ఈ బాధను నీవుకూడా అర్థంచేసుకోనప్పుడు, నప్పుడు నేనేం చేయను? నా నరాలను, మనస్సును, యాన్ని చీల్చి, వాటిలో తప్పించుకునే గత్యంతరంకాని, కాని లేక, మెలికలు తిరిగిపోతూ ప్రసరిస్తున్న నా బాధన చూపిస్తున్నాను. నీకు వినిపిస్తున్నాను. ఇంకా నీవు " విడవను, నిన్ను వెంటాడుతాను" అంటే ఇక నా పరిస్థితి చెప్పను?

నేను నేనుగాఉండే ఆ రెండు క్షణాల్లో నాకు కుర్చీ ఎలా గుర్తుంటుంది? ఆ రెండు క్షణాలు శాంతితో దానైపోతాను. కవీ! పిచ్చికీ, తన్మయత్వానికి తేడా ఏ కనుక...కవీ! నన్నుగురించి ఆలోచించకు. నా కలల్ని పోనియ్. నన్ను మర్చిపో. నిన్ను ప్రార్థిస్తున్నాను కవీ నేను భరించలేను కవీ నీ అనంత ప్రేమజ్వాలను. చూచినా నీవే. ఏం చేస్తానో తెలియదు. ఎందుకు చే నాకు తెలియదు. కవీ! నీవు నన్ను పూర్తిగా పిచ్చిదాని

శావ్. నా కిష్టమే అలా పిచ్చిదాన్నై, నీ ప్రేమజ్వాలలో మాడి మసై పోవడం. కాని బోసి కుర్చీ అది సహించదు. తిడు తోంది. రంపపుకోత కోస్తోంది. పాపం ఆ బోసి కుర్చీనిమాత్రం బాధ పెట్టడం ఎందుకు, నేను రెండు క్షణాలు శాంతిని పొందడానికి.

అయినా కవీ! నాకు శాంతేమిటి? నిన్ను పొందే శక్తీ, తీరికా నాకు లేవు. నా హృదయం తూట్లుపడిపోయింది. నా మనస్సు మాడిపోయింది. నా నరాలు నలిగి పగిలిపోయాయి. నా జీవితం త్రుప్పుపట్టిపోయింది. అయినా ముందుకు నడుస్తుంది నా యీ శూన్య శకటం. ఎందుకో! ఎవరికోసమో!!...... ఎందుకో కాదు. ఎవరికోసమో కాదు. నాకు తెలియకుండా నేను పుట్టినందుకు, నా జీవితం నేను జీవించలేనందుకు, నా చావు కేవలం నా చేతులలో లేనందుకు.

## 24

కవీ! నా కవీ! ఎక్కడనుండి ప్రత్యక్షమయ్యావు నాకు! నీ భక్తురాలిమీద అంత దయ ఎలా పుట్టుకువచ్చింది? కవీ ఎలా చెప్పను నీకు. పారవశ్యంలో నా రక్తాన్నంతా ఆనందబాష్పాలుగా మార్చుకుని వాటితో నీ పాదాలను అభిషేకించి, నీ పాదాలమీదనే అలానే కరిగిపోవాలనుంది... అలా కరిగి

పోకుండా తిరిగి ఎలా బ్రతకగలను నీవేచెప్పు కవీ. తరువాత మళ్ళి బోసి కుర్చీని చూడటానికి నేను అంత నీచమయినదాన్నా ఏమిటి? నీ పాదాలు తప్ప నాకింకేం కనపడతాయి చెప్పు. కవీ! నిజంచెప్పనా? ఆనాటి రాధను వెళ్ళి ఒక్కసారి కౌగలించుకోవాలని ఉంది నాకు. ఆ రాధ దేవుడు, కృష్ణుడు కన్న నీవే గొప్పవాడివి నాకు కవీ! ఎందుకంటే ఆ రాధ అమాయకంగా, పాపం — దాచుకోలేక "నిన్ను విడువలేను" అని చెప్పాకనే ఆ కృష్ణుడు కనికరించి తనలో ఐక్యం చేసుకున్నాడు. మరి నేను అర్థంలేని అహంకారంతో, గర్వంతో నీ దగ్గఱనుండి పారిపోతున్నా ఓపికతో ఆపుకుని, నీలో ఐక్యం చేసుకుంటున్నావు... దేవుడిలో లోపం ఉండకూడదు కదూ కవి! మరి ఆ కృష్ణుడిలో ఎంత చిలిపితనం ఉంది! పాపం పిచ్చి రాధను ఎంత బాధపెట్టేవాడు...కాని నీలో ఆ లోపంకూడా లేదు... ఆ పిచ్చిలోపాలు ఉన్న నన్ను కూడ నీలో చేర్చుకో గలుగుతున్నావంటే నిన్నేమనాలి? దేవుడివి... ఊహు! అంతకంటే గొప్పవాడివి—— నా కవివి.



## 25

నీ అశక్తతను అర్థం చేసుకోమంటున్నావు కదూ కవీ! నన్ను నీలో ఒక్కక్షణం ఇముడ్చుకోలేని నీ అశక్తతకు ఏమీ చేయలేక ఏడుస్తున్నావు కదూ!... కవీ! "నేను నీ కెప్పుడూ అందకుండానే ఉండాలి" అంటే వినేవాడివికావు. ఇప్పుడైనా తెలిసిందా నీకు, నన్ను నీలో ఒక్కక్షణంకూడా ఇముడ్చుకో లేవని. నీకు అందకుండా దూరంగాఉంటే "నీ హృదయంలో ఆర్ద్రత లేదు. పాషాణానివి"అని తిడతావు నన్ను, పళ్ళు బిగబట్టి. అసలు హృదయమంటూ ఉంటేగా దానికి ఆర్ద్రత అంటూ ఒక టుండటానికి. కేవలం అక్కడ శూన్యం మాత్రమే ఉంది. ఏమీ లేదు డొల్ల. అందుకనే ఆ డొల్లలో నిన్ను ఇముడ్చుకోగలను. నిన్ను తల్లిలా పొదువుకోగలను. నీకు హృదయం ఉంది. దానిలో ఆర్ద్రత ఉంది. అందుకే నన్ను నీలో యిముడ్చుకోవ డానికి ఇష్టపడతావు. కాని ఇముడ్చుకునే శక్తిలేదు. ఎందు కంటే నీ హృదయమంతా ఆర్ద్రతతో నిండిఉంది. ఇక నన్ను ఇముడ్చుకోవడానికి చోటేది దానిలో. "ఏం అంత బ్రహ్మాండ శరీరమా నీది అంత నా హృదయంలో పట్టకపోవడానికి, అసలు నీ కిష్టంలేదు నాలో ఇమడడానికి. బ్రహ్మాండమైన దానివని అహం ఎక్కువ నీకు. కవే నీకోసం పడిచావాలి. వెంట పడాలి. అంతే. నీవు అతనివెంటమాత్రం పడకూడదు. అంత బ్రహ్మాండ మైన నీవు 'ఏదో పోనీలే పిచ్చివాడు'అని జాలి తలిచి ఒక్కసారి

మాత్రం అలా కొంగు చాటుకు తీసుకుంటావ్. అదికూడ నీ యిష్టంతో కాదు; ఏదో పిచ్చివాడు, అమాయకుడు అనే జాలితో... అంతేనా ఛీ! నీవు రాక్షసివి"అని అసహ్యించు కుంటున్నావు కదూ నన్ను కవీ! కవీ ఒక్కటడుగుతాను చెప్పు. నేను బ్రహ్మాండమయిన దాన్నని ఎప్పుడైనా చెప్పానా? ఆఖరికి నీవు చూస్తున్నా ననుకుంటున్న శరీరంకూడా లేదన్నానే. కేవలం రేణువుని, శూన్యాన్ని అని మాత్రమే చెప్పానే. అయినా ఎంతకీ నీవు వినకపోతే ఒక హృదయాన్ని కల్పించుకుని, దానిలో ఆర్ద్రత నింపుకుని నీలో ఒక్కక్షణం పసిపాపలా ఇముడుదా మనుకుంటే జరిగిందేమిటి?... నీ అశక్తత వెల్లడయింది నీకు కూడా. అది నీకు తెలియకుండా ఉంచుదామనే ప్రయత్నించాను. కాని నీవు మంకుపట్టు పట్టావు. "నా అశక్తతకు నేను ఏడు స్తాను. నీకేమయింది" అంటావు కాకపోతే. ఏం ఏడుపు నీకే చేతనయిందా? నీ సొత్తా? నీవైతే ఏదో ఓక్షణంమాత్రమే ఏడుస్తావు. నేనైతే అనుక్షణమూ ఏడుస్తానే దానికేమం టావ్!... నా పిచ్చికాని, నిన్ను నే నడగడమేమిటి? "నన్ను వెంటాడకు"అని నీకు చెప్పడమేమిటి? నే నే నీకు దూరంగా ఉంటాను. నీ కందను. నువ్వంటూ ఒకడివి ఉన్నావనే మాటే మర్చిపోతాను. కాని ఒక్కమాట కవీ! నేను నీకున్నాను. నేను నీకు అక్కర్లేదనుకుంటే మరీ హాయి. నీవుమాత్రం నాకు లేవు. నీకు నిముషానికొకటి వేరువేరుగ జరుగుతాయేమో! ఒకటి

దొరికి, పోయి, మళ్ళీ దొరుకుతుందేమొ! కాని నాకు ఏదైనా ఒక్కసారే, ఒక్కటిగానే దొరుకుతుంది. పోతే ఏకంగా పోవటమే... "నా అశక్తతకు కారణం బోసి కుర్చీ. నన్ను చూచి జాలిపడు" అంటావు. నా జాలంతా, ఆర్ద్రిత అంతా నీవేగా. అందుకనే అవి వేరే నాకు లేవు.

## 26

ఎలా కవీ నీతో మరీ ఇంత మంకుపట్టుపడితే. "నన్ను చిరాకుపఱచకు. నాకు తీరికలేదు" అంటే ఊరుకోవుకదా! నేను కాస్త గద్దిస్తే రోషంతో ఇంతెత్తున లేచిపడతావ్. 'పోనీలే కోపం వచ్చినా నన్ను విసిగించడు' అనుకుంటే ఇంతలోనే అంతెత్తు లేపించిన ఆ రోషమంతా ఏమయిపోతుందో, లావా లాగ ఒక్కసారిగ అణిగి, చల్లబడిపోయి, మరీ నిస్సహాయంగా ఏకంగా ఒకటే ఏడ్వడమా? పిచ్చికవీ ఎలా నీతో! నీవు నన్ను విసిగిస్తున్నావని గద్దించనా? పోనీలే రోషంతో కోపం తెచ్చుకున్నావని స్థిమితపడనా? నిస్సహాయంగా కుమిలి కుమిలి ఏడుస్తున్నావని కొంగు చాటుకు తీసుకోనా? "అన్నీ చేయి. నీ యిష్టంవచ్చినట్లుగా నన్ను మలుచు. కాని నన్ను ఉపేక్షచేయవద్దు. నన్ను దూరంగా నెట్టివేయవద్దు. అదే శాపంగా నన్ను మాడ్చేస్తుంది. నాకు చాలా భయంగా ఉంది. నా గొప్పతనాన్ని,



నా తెలివితేటల్ని చూచి, నన్ను దగ్గరకు తీసుకోమని నిన్నడగటంలేదు. నా నిస్సహాయతను చూచి జాలిపడి నీ ఒడిలోకి చేర్చుకోమని నిన్ను ప్రార్థిస్తున్నాను" అంటూ వాపోతావు నీవు కవీ. ఎలా నీతో చెప్పు. 'నన్ను ఊరికే విసిగించి, వేధించకు' అని నేనంటే "పోనీ ఈ జన్మకు నీ పాదాలను నా కన్నీటితో కడిగి సొరిగిపోతాను, వచ్చే జన్మలోనైనా నా నీదరి జేరడానికి" అంటావు. "ఇంకొక జన్మ కావాలని ఎందుకు కోరుకుంటావు? ఈ జన్మతోనే అంతంచేసుకుని మోక్షముపొందాలని ఎందుకు కోరుకోవు?" అని నేనంటే "నీవు లేనిదే నాకు మోక్షమేమిటి? నీ సాన్నిధ్యంలో ఉండడమే, నీ ఒడి చేరడమే నా మోక్షం. అది ఈ జన్మలోనే సాధించగలను అనుకున్నాను. . .లేదు. నాకా శక్తిలేదు. ఈ జన్మంతా నీకోసం తపస్సు చేసి చేసి కరిగిపోతాను. నా కభయమియ్యవూ, 'నిన్ను దరిజేర్చుకుంటాను వచ్చే జన్మలోననీ' " అని ప్రాధేయపడుతున్నావా నా కవీ! కవీ! నీ విసిగింపు, కోపం, ప్రార్థన నాకెంత మధురంగా, వేదనగా, బాధగా ఉంటాయనుకుంటావ్ !!

# 27

కవీ! ఏం చేస్తున్నావ్? నా పిలుపుకోసం ఎదురుచూస్తు న్నావా కవీ! అందుకే నిన్ను 'పిచ్చికవీ' అని ప్రేమగా జాలి పడతాను. నిన్ను నేను పిలవాలంటావ్. "నిన్ను నేను పిలవడ మేమిటి?" అంటే "ఏం! నేను నిన్ను అహర్నిశలు పిలుస్తూనే ఉంటానే, నీ నామమే జపిస్తానే, అనుక్షణం నీదగ్గరే ఉండాలను కుంటానే, ఒక్కసారి ఆప్యాయతగా నీఅంతట నీవు నన్ను దగ్గ రకు రమ్మని పిలవవెందుకు?...అబ్బ! నీ కెంత అహంకారం! నేనే నీదగ్గరకు, నీవు పిలవకపోయినా రావాలి. నీవుమాత్రం ఎప్పుడూ నీ అంతట నీవు నన్ను చూడాలని అనుకోవు" అంటావు ఉక్రోషంతో.

పిచ్చికవీ! నీవు మరీ పసివాడివి. నీలాగే నేనూ ఉంటే ఎలా? నీవు నన్ను చూడాలనుకుని నా దగ్గరకువస్తావ్. ఎక్కడ పడితే అక్కడ చూడలేవు. ఎక్కడోమాత్రమే చూడగలుగు తావు. నా. సామీప్యాన్ని ఊహాలలో, భావమాత్రంగా అనుభ వించలేవు. చాలసార్లు అయోమయంగా "ఎవరవు నీవు" అని అడుగుతావు. కొన్నిసార్లు లీలగ నవ్వి ఊరుకుంటాను. కొన్ని సార్లు వేరువేరుమాటలతో నేనెవరో స్ఫురింపజేస్తాను. నేను భావాల భవంతిని; ఊహాల ఊటను; అనుభవాల అంతస్థును; రాగాల రేఖను; జీవితపు సుడిని; శోకాల సూక్తిని; సుఖాల

సమాధిని; ధూళిలో రేణువుని; నీటి అలల తీవ్రతని; గాలి తరంగాల హోయిని; విశాల విశ్వ అఖాతాన్ని; అఖాతాల లోతుని; పర్వత శిఖరపు నునుపుని; చిట్టడవుల చిక్కదనాన్ని; కారుచిచ్చుల వేడిమిని; వెన్నెల తెలుపుని; ఆకాశపు అనంతాన్ని; పూరేకుల మృదుత్వాన్ని; మొగ్గలోని ముగ్ధత్వాన్ని; పిందలోని పసితనాన్ని, పండులోని నిండుకుండను; పూవులోని బ్రతుకు పంటను; పసిపాప నవ్వులోని నిర్మలతను; కంటిపాప చిరునవ్వుని; పెదవివంపుని; హృదయపు విశాలతను; మదిలోని మమతను; ఆత్మలోని ఏకత్వాన్ని; శరీరపు శూన్యాన్ని; తరగని సాను భూతిని; అవధులులేని క్షమని; హద్దులులేని ఓర్మిని.

నాకు నీ వెవరివో తెలుసా ?... జీవన కావ్యాలలోని ఆవేదనవు; తెలివివి; అందానివి; నిస్పృహావు; నిరాశవు; ఆరాధనవి; తన్మయత్వానివి; అమాయకత్వానివి; నా పిచ్చి కవివి. నిన్ను నేను అనుక్షణమూ చూస్తూనే ఉంటాను. నీ మనస్సును, నీ భావాలను అనుభవిస్తూ నాలో జీర్ణింప చేసుకుంటూనే ఉంటాను. పిచ్చి కవివి ! ఆ సంగతి నీ కెలా తెలుస్తుంది ? నేను ఇంతలా విడమర్చి చెప్పినా అర్థంకాదు గదా ఎలా కవీ నీతో ! ఎందుకలా నిస్సహాయంగా, ఆరాధ నతో తన్మయత్వం చెందుతావు ? నాకెంత ఇష్టమో తెలుసా నీ ఆ మూర్తి !!!

## 28

ఎక్కడున్నావు కవీ ?... "చాలా రోజు లయిందం టున్నావా నిన్ను పలకరించి ? నన్ను చూచి కొన్ని యుగా లయిం"దంటున్నావా ?... అవును. దేవతలకు యుగ మో క్షణమట... అలాగే క్షణ మొక యుగమేమొ !... సరేకాని ఏమిటీ ? ఏం చేస్తున్నావ్ ?... "ఏం చేస్తాను నేను...... వ్రాస్తాను'' అంటున్నావు కదూ ! నిజమే కవి వ్రాస్తాడు... ఊహు ! వ్రాసుకుంటాడు ఒక్కొక్కక్షణం తానెవరో తానే మరిచి పోతాడు తన్మయత్వంలో. తన పాత్రలకు తానే సృష్టి కర్త ననేది మర్చిపోతాడు. తన పాత్రలే తనని, తన కావ్యాలే తనని సృష్టిస్తున్నాయా అనుకొంటాడు. తన కావ్యాలే తన హృద యపు లోతుల్ని ఎత్తి చూపుతున్నాయా అనుకుంటాడు. కవికి అన్నిటికంటె కావ్యాలల్లటమే తేలిక... ఆ కావ్యాలలో తనలోని ప్రేమను, జాలిని, ఆవేదనను, ఆరాధనని, బోసి కుర్చీ లోని ద్వేషాన్ని, అసూయను అన్నింటిని ప్రవహింప జేస్తాడు. పాత్రల్ని గిలిగింతలు పెట్టి నవ్విస్తాడు. ఆవేదనలో వేగిస్తాడు. తన్మయత్వంలో ఊగిస్తాడు. తన పాత్రలకి అమరత్వాన్ని కల్పించి తానూ అమరకవి అవుతాడు... "ఎప్పుడూ నా కావ్యాలు, నా పాత్రలే అంటావుకాని నన్నుగురించే ఆలోచించవు. నన్ను తలవనే తలవవు, నీ అంతట నీవు"అని బిక్కముఖం పెడతావు. పిచ్చి కవీ ! ఎందుకంత దిగులు. నీ పాత్రలలో, నీ కావ్యాలలో

నీ తెలివిని, శక్తిని, ఊహను, నిన్నే కదూ నేను చూచేది... కవీ ! నీ శక్తి నీకు తెలియదు. నన్ను కూడ గుర్తించడానికి అవకాశ మీయనంటావు. నేనంటే నీకున్న ప్రేమను, నీ ఆరాధనను మాత్రమే గుర్తించి నిన్ను స్వీకరిస్తే చాలంటావు. ఏది చాలో, ఏది కావాలో, ఏది అక్కర్లేదో నీకేం తెలుసు ? నీకు తెలియక పోవడంలో అర్థం ఉంది కాని అవి నాకు తెలియాలిగా ! పిచ్చి కవీ ! ఎంత పసివాడివి ! "నీ వన్నదంతా ఒప్పుకుంటాను. నా కేమీ తెలియదు నిజమే. ఏది కావాలో నాకు తెలియదంటు న్నావు. అది మాత్రం నీకూ తెలుసు, నాకూ తెలుసు. నాకు కావలసింది నీవు" అంటున్నావా ? ఏమిటో పిచ్చి కవివి ! ఎలా నీతో !!

## 29

కవీ ! ఎక్కడ దాగావు ? ఎక్కడికి మాయమయ్యావు ? పిలుపు దూరంలో కూడా లేవా ? ఉన్నా వినిపించుకోలేదా ? తూట్లువడిన నా హృదయపు పిలుపు నీ వద్ద కెలా చేరుతుంది కవీ ! నా కెంత సిగ్గనుకున్నావ్, నా మాడిన మనస్సును, తూట్లు వడిన హృదయాన్ని నీ ముందు విప్పడానికి !!... "ముసుగు చాటుతో నన్ను దహించకు" అంటావు కవీ ! గుంభనగా ముసుగు మధ్యలో నా మనోశకలాన్ని దాచుకున్నానే ! అది

బట్టబయలు చేసుకుని ఇంకెలా బ్రతకను చెప్పు ? "అనుక్షణం చిరునవ్వులు చిందిస్తూ, సునాయాసంగా ఉంటావు నా దగ్గఱ" అని నీవేకదూ అంటావ్ ! చిఱునవ్వు నవ్వక, పసివాడివి, అమాయకుడివి, నీమీద నా ఆవేదనలో రేగే నిప్పురవ్వలను చిందించమంటావా ? నేనంత క్రూరురాలిని కాగలనా ? కావ్యాల అల్లికలో వేడెక్కిన నీ నుదుటిని ఊహించుకుంటేనే, నేనో హిమవత్పర్వతాన్నై ఆ వేడినంతటినీ నాలోకి పీల్చుకుని, కరిగిపోవాలని ఆతృతపడతానే ! ఆలోచనలలో సొమ్మసిల్లిన నీలో నుండి నేను లేచి, నీ కావ్యాన్ని పూర్తిచేయాలని ఉవ్విళ్ళూరుతానే ! నీకు తెలియకుండానే నీ పాదాలకడ ఒరిగి చిరశాంతిని పొందుదామనుకుంటానే !... కవీ ! ఏమిటో పిచ్చిగా అంటున్నాను కదూ ! నా పిచ్చికవీ ! లే ! నా హృదయాన్ని ఛాయామాత్రంగా కూడ నీకు చూపను. భయపడకు కవీ ! ఏడవకమ్మా ! నా కోసం నీవేడుస్తావా ? ఛీ ! ఛీ ! కవీ ! ఏవి నీ చెంపలు. ఏడవకు నా కొంగుతో అద్దుతాను నీ కన్నీరు !" ఎంతలో ఎంత సంతోషం ! "నీ కొంగుతో తుడిపించుకోవడానికి ఎన్ని యుగాలు ఏడవమన్నా ఏడుస్తాను హాయిగా" అంటున్నావా ! నీవు 'హాయిగా ఏడుస్తా' నంటుంటే నాకు బాధగా నవ్వాలని ఉంది !!

# 30

కవీ నా నిరీక్షణకి అంతంలేదా? ప్రతిక్షణం ఒక యుగంగా నీకోసం ఎదురుచూస్తూ ఉంటానే! ఆ మాటచెబితే నీవు నమ్మవ్! "నీవెందుకు చూస్తావ్! ఏదో నన్ను బులిపించడానికి అంటావంతే" అంటావు. 'అంతలా ఎదురు చూస్తున్నట్లే కనపడవే! నా రాకనే గుర్తించవ్! నా ఉనికినే గమనించనట్లుగా ఉంటావు" అంటావ్. నిజమే కవీ! నిరీక్షణకి అలవాటుపడిన నాకు దాని అంతం, గమనింపులోకి రావడంలేదు. ఎక్కడో ఉన్న నీవు నా కళ్ళెదుట ఉన్నట్టుగ గోచరిస్తావ్! కళ్ళెదుటఉన్న నీవు ఎక్కడో తిరుగాడుతున్నట్టుగ అగుపిస్తావ్! నీతో మాట్లాడుతూఉన్న ఆకాసిని క్షణాలు ఏదో మాయగా ఉంటాయి. ఒంటరిగా కూర్చున్న నా చెవులు నీ మాటలతో గింగెర్లెత్తుతాయి. కవీ! ఈ తపనకు అంతంలేదా? నీ కోసం చూచిచూచి కళ్ళు కాయలు కాసిపోయాయి. ఇకనిన్నెలా గుర్తించగలను చూపులేని ఈకళ్ళతో చూచి? ఇంకెలా అర్పించగలను ఈ ఒట్టి పోయిన హృదయాన్ని నీకు? నీ కోసం విశ్వం అంతా గాలిస్తున్నాను, ఎక్కడైనా, నా చాచిన చేతులకు తగులుతావేమోనని!

కవీ! నేనిక దక్కుతానో లేదో ఏ రూపంలో కూడా! శరీరం సడలిపోయింది. హృదయం పగిలిపోయింది. నీ వేడి కన్నీటి బొట్టొకటి రాల్చుతావు కదూ శుష్కించిన నాపై!!

# 31

కవీ! రగిలే గుండెలతో, పగిలే హృదయంతో, చిర శాంతిని ప్రసాదించమని నీవు నా దగ్గఱ కొస్తే; బోసి కుర్చీ కెదురుగా, నిస్సహాయంగా ఒంటరిగా, గాయపడి ముక్కలు ముక్కలుగా విరిగి రక్తం ఓడుతున్న నా హృదయాన్ని విప్పుతున్నాను నీముందు. ఒక్కక్షణమైనా నాకూ కావాలి శాంతి. కాని ఎక్కడ దొరుకుతుంది? ఎవరిస్తారు? నాకు నీవు, నీకు నేను మాత్రమే యిచ్చుకోవాలి. ఈ నాటి నా స్వరూపాన్ని చూచి తెల్లబోతున్నావు కదూ కవీ! ఇంత భీరువునై, ఆర్తుడవు నీ ముందు, నా గాయాన్ని ప్రదర్శించానని ఆశ్చర్యపడుతున్నావు కదూ! కవీ! లోన బాధతో మూల్గుతూ, పైకి చిరునవ్వు నవ్వుతూ, నిన్ను మోసగించడానికి ప్రయత్నించినా నీవు నిజాన్ని పసిగట్టేయగలవని తెలుసు నాకు. అటు చూడు! బోసికుర్చీ ఎంత కపటంగా నవ్వుతోందో! కవీ! నీకు తెలిస్తే చెప్పవూ! సామాన్యంగా దానిసంగతి నాఅంతట నేను పట్టించుకోనే! నన్ను గురించి తెలుసుకునే అవకాశం కూడా యివ్వనే. దాని కెందుకు ంత ఆతృత నన్ను పరీక్ష చేద్దామని. కల్ల బొల్లి కథలు కల్పించి ప్రచారం చేద్దామని. దానికి నే నేమి అపకారం చేశానని, నామీద కసి తీర్చుకోవడానికి ఉరకలువేస్తుంది. దీని కంతకూ కారణం 'ఈర్ష్య' అంటావుకదూ కవీ నీవు! నన్ను చూచికూడ ఈర్ష్య పడాలా బోసికుర్చీ? నేను తన దోవకేమి

అడ్డువచ్చాను ? అది అవమానాలు పొందుతూఉంటే చూచి నవ్వలేదే నేను ! సానుభూతి చూపడానికి ప్రియత్నించాను. దెబ్బతగిలి బాధపడుతుంటే చూచి ఊరుకోలేదే నేను ! మందు మాకులు వేశాను. క్షోభపడుతుంటే నాకు తెలియనట్టు ఊరు కోలేదే ! ఉపశాంతిని కలిగించడానికి ప్రయత్నించాను. కష్టాలు పడుతుంటే వూరుకోలేదే ! దానికి అండగా నిలిచాను. ఈ చేసిన పనులకు, తన పబ్బం గడిచాక, బోసికుర్చీ నన్ను అప హాస్యం చేస్తూ, చీకాకు పరుస్తున్నా, చూచీ చూడనట్లూరు కున్నానే ! అది నా అసమర్ధతగా తలచి నేను చీకాకు పడటం లేదని, యింకా కినిసి, తన అసభ్యప్రివర్తనతో నాహృదయాన్ని గాయపఱచి, పగలగొట్టి, కపటంగా నవ్వుతూ నాఎదురుగా తీరి కూర్చున్న బోసి కుర్చీని ఏం చేయాలంటావ్ !... అబ్బ ! ఎంత కోపం వస్తూంది బోసి కుర్చీమీద నీకు ! నీ కనుచూపులు నిప్పుల్ని చెరుగుతున్నాయ్ ! కవీ ! ఎందుకంత క్రోధం నీకు బోసి కుర్చీ మీద ! ఏదో తెలిసీ తెలియక నామీద గల తన ఆప్యాయతను ఎలా చూపెట్టాలో అర్థంకాక తికమకపడి నన్నిలా కల్లోల పరు స్తుంది. గాయ్యాలు తగలకుండా వుంటాయా ? తగిలిన గాయాలు మానకుండా వుంటాయా ? నా గాయం మానింది. ఇక నీ గాయాన్ని మానుపుతాను కవీ ! దిగులుపడకు... ఎందుకలా సందేహంగా చూస్తావ్ నావంక పిచ్చి కవీ ! నిజంగా నా కేమీ బాధలేదు ఇప్పుడు. "ఏమిటో నీ వెంతకీ అర్థంగావు నాకు"

అంటున్నావు కదూ! పిచ్చి కవీ! నీకు కాకపోతే నే సింకెవరికి అర్థమవుతాను !!

## 32

కవీ! ఎందుకలా దిగులుగా వున్నావు? ముఖమంతా అలా వాడిపోయిందేం? ఎవరేమన్నారు నిన్ను. ఎవరేం జేశారు నిన్ను... నీ కేమీకాలేదా! మరీ?... నా కేదో అన్యాయం జరుగుతోందా? నాకు విరోధులెవరున్నారు అన్యాయం చేయటానికి? నే నెవరికేమి అపకారం చేస్తాను విరోధులుండటానికి? అపకారం చేస్తేనే కాదు విరోధులుండటం — అందుకోలేని దూరంలోవున్నా విరోధులుంటారు. బోసి కుర్చీని చూడు, తన అక్కసును ఎలా వెళ్ళబోసుకుంటుందో నీ మీద! దాన్ని నీవు గుర్తించడంలేదని దాని గోల. దాని ఈర్ష్యా, అసూయాజ్వాలలు నిన్నేమీ చేయడంలేదని దానికి రోషం. అది రెచ్చగొడితే నీవు రెచ్చిపోయి, దానిని తిట్టడంలేదని దాని బాధ. అది అవాకులు చెవాకులు పేలుతుతూఉంటే నవ్వుతూ ఊరుకుంటావెందుకు నీవు? గట్టిగా బుద్ధెందుకు చెప్పవ్?" అని అడుగుతున్నావా కవీ?

కవీ! నీకెంత అభిమానం నేనంటే! బోసికుర్చీ నిన్నేమీ అనకపోయినా, నన్నేమో అంటుందని, నా కేదో చీకాకు

కలిగిస్తుందని బ్రహ్మాండము బ్రద్దలై నంతగా బాధపడుతున్నావే! ఇం కేమి కావాలి కవీ నాకు ? నీ అండ, నీ సానుభూతి వున్నంత వఱకు ఎన్ని బోసి కుర్చీలు నాపై కత్తిగడితేమట్టుకు, నాకేం భయం ? కవీ! నవ్వ కేం చేయమంటావ్ ? బోసికుర్చీ అసలే అజ్ఞానంలో పడి కొట్టుకుంటుంటే, నేను కూడా పైగా తిట్టనా !... "ఆ సంగతి నాకూ తెలుసు. కాని బోసి కుర్చీ అలా అనుకోవడంలేదు. అసమర్థత వల్ల ఊరుకుంటున్నావని అనుకుంటోంది" అంటున్నావు కదూ కవీ ! అదీ తెలుసునాకు. పోనిద్దూ బోసి కుర్చీ పసిది. ఏదో తెలియనితనం. నన్ను గుర్తించ డానికి ప్రయత్నించకుండావుంటే బావుండేది పోనీ, నన్నర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తోందే అనుకో! దానికి తప్పుడు దోవలనే పోతుందెందుకో! "చూశావా మరీ! 'కోపం ఎందుకు నీకు బోసి కుర్చీమీద' అంటావ్. తెలియక తప్పుడుదోవల పడితే పోనీలే అనుకోందును. తెలిసి కూడా ఆ బాటల్నే పోతుం దెందుకూ ?" అని అడుగుతున్నావ్ మళ్ళీ!... నీతో పెద్ద చిక్కేనే! ఎంతచెప్పినా నీ ధోరణి నీదే! ఇప్పుడు నా మాటలు నీకు అర్థం కావులే. కాసేపు నీవు నా దగ్గఱకూర్చో. ఆ తరు వాత నీ అంతట నీవే మర్చిపోతావ్ బోసి కుర్చీ సంగతి...... ఎంతలో ఎంత సంతోషం ! ఉత్త పిచ్చి కవివి ! చూశావా క్షణంలో పోయింది బోసి కుర్చీమీద కోపం నీకు !!

# 33

కవీ ! ఎంత ఒంటరిగా ఉందనుకున్నావ్ ఇప్పుడు ! నీవేం చేస్తున్నావ్ ?... నీకూ అలాగే ఉందా ?... అంతా నటనే. నేనన్నానుగదా అని నీవూ అలాగే అంటావు... నమ్మానులే. నసపెట్టకు. ఎంతలో ఎంత రోషం ! బాగానే ఉంది గొడవ... నీ అలకల్ని తీర్చడమే నా పనయిపోయిందే !... ఒక రహస్యం చెప్పనా నీకు?... ఆ ! ఆగు. ఏమిటో ఆ తొందర ! మరి... ఎందుకబ్బా అంత ఆతృత ! చెబుతానులే ఉండు. నీ ముఖ లక్షణాలు చూచి నవ్వాపుచేసుకోలేక మొదలుపెట్టి ఆవేశాను చెప్పటం... "నువ్వసలు నాకేమి చెప్పక్కర్లేదు. ఊరికే ఊరించి ఊరించి చంపుతావు" అంటున్నావా అవమానం పొందిన వీరుడిలా. మరి పిల్లల్ని ఎలా ఉడికించాలీ-నీవే చెప్పు. ఇంతకీ విను... ఏం మళ్ళీ చెవులు నిక్కపొడుచుకున్నాయే. "నీవేమి చెప్పక్కర్లేదు, చెప్పినా విన"నన్నావుగా బింకంగా... ఉండుమరి లేచిపోకు. అసలే ఒంటరిగా అనిపిస్తోందని చెప్పాలా ! నీకు కూడ నా మీద కోపమైతే ఎలాగమ్మ?... లేదులే ఊరికే అన్నాను. నీ కెందుకు వస్తుంది నా మీద కోపం ! నీ చిన్నతనపు చేష్టలన్నీ నా ముందు చూపక ఇంకెవరి ముందు ప్రదర్శిస్తావ్? నిన్ను గురించి నే నేమనుకుంటానో అని భయంగా ఉందా ? ఏమనుకుంటే మాత్రం ఏం ?... నిన్ను గురించి అనుకునేటం దుకు ఏముంది. నీవు 'నా కవివి, నా పిచ్చి కవివి, వెట్టి పాపవు'

అనుకుంటానంతే... ఎంత అమాయకంగా, ఆప్యాయతగా నవ్వుతావు. నా కెంత ఇష్టమనుకున్నావ్ నీ ఆ నవ్వు. ఆ నవ్వు, ఆ ఆప్యాయత నా కెంత స్ఫూర్తిని, ధైర్యాన్ని కలిగిస్తాయను కున్నావ్! కవీ! ఎందుకు నీ కింత ఆప్యాయత నేనంటే ?... "ఎవరు చెప్పారు నీవంటే నా కాప్యాయతనీ ?" అంటున్నావా? భలే! మొత్తానికి గడుసుమీరావే! అవి నా మాటలేగా. నా దగ్గఱ నేర్చుకుని నాకే పాఠాలు నేర్పుతున్నావే మళ్ళీ. "నీవేగా నాజీవితం. నీ మాటలు కాక నాకింక వేరే మాట లేమి వచ్చు?" నంటున్నావా! కవీ! ఎంత ఆర్ద్రహృదయంనీది! ఎంత సంపూర్ణంగా సమర్పించు కుంటావ్ నిన్ను నీవు!... కవీ! నీ పాదాల మీద ఒరగటమే నా ఆశయం, నిన్ను చేరడమే నా గమ్యం, అని నీకూ తెలుసు, నాకూ తెలుసు. మరి మధ్యలో "నీ పాదాలదగ్గఱ కూర్చోనిస్తే చాలు. ఒకసారి నాతల నిమిరి హృదయానికి హత్తుకుంటే చాలు" అంటావెందుకు ఎంతో ఆరాధనతో? అలాంటి మాటలని నన్ను సిగ్గుతో తలను నేలలోకి దూర్చేసుకునేటట్లు చేస్తావెందుకు?... నీ గొప్ప తనాన్ని, నీ అమరత్వాన్ని, అల్పజీవిని నాకు, ఆపాదించడంలోనే ఉందికదూ నీ దైవత్వం! నిన్ను 'పిచ్చి కవీ' అంటాను కాని నిజానికి నేనే పిచ్చిదాన్ని నీ వాడించినట్లల్లా ఆడుతున్నాను. నిన్ను నీవు పాతాళానికి కుంచించుకుని, నన్ను ఆకాశానికి లేవనెత్తుతావు. ఎంత త్యాగమూర్తివి నీవు... అదుగో... ఇలాంటి మాటలంటే విసు

క్కుంటూ ముఖం చిట్లిస్తావ్. నిజమేగా నేను చెప్పింది. లేక పోతే ఎన్నాళ్ళేమిటి ఈ నాటకం ? నాకూ విసుగొచ్చింది నీచేత సేవలు చేయించుకునీ, చేయించక నీ. ఎవరి స్థానాల్లో వాళ్ళని ఉంచితే ఎవరికీ ఇబ్బంది ఉండదు. ఎందుకంత దారుణంగా చూస్తున్నావ్ ! నే చేసిన తప్పేమిటి? ఉన్నమాట అన్నాను. ముమ్మాటికీ అదే అంటాను. నే నే నీ పాదాల మీద వాలవలసిన దాన్ని. అంతే... వద్దు కవీ ! వెళ్ళొద్దు... నీ యిష్టంలేబాబూ! నే నింకెప్పుడూ యీ సంగతి ఎత్తను. నీకు తెలిసేటట్లుగా నిన్నేమీ ఆరాధించనులే. నిన్నే నా దగ్గఱకు తీసుకుంటాను. ఏదైనా చేస్తాను. నీవు నా దగ్గఱనుండి వెళ్ళిపోకుండా ఉంటే చాలు. నీవే లేకపోతే ఇక నా బ్రతుక్కి అర్థం ఏముంది !... "ఇంతకీ ఆ రహస్యం చెప్పకుండానే మధ్యలో ఈ భాగవతం పెట్టావ్" అంటున్నావా? ఇంకా దాని మాట మర్చిపోలేదన్న మాట. ఇక ఆట్టే బాధపెట్టనులే నిన్ను. ఇదుగో, విని ఇప్పుడు కాకపోతే మరొకప్పుడైనా సమాధాన మివ్వాలి తెలుసా దానికి ?... మరీ మొన్న బోసికుర్చీ మంచి హుషారులో ఉంది. ఉండి అడిగిందీ "నీవేమి అనుకోకపోతే అడుగుతాను...కవి నీకేమవుతాడు, నీవు కవి కేమవుతావూ" అని ... అదుగో నాలాగే నీవూ ఆలోచనలో పడ్డావూ ఈ ప్రశ్న వినగానే !... నిజమే కవీ ! మనం ఒకళ్ళ కొకళ్ళం ఏమవుతాం?

# 34

నీతో నేనేమి మాట్లాడనులే. నాకు నేను ఒట్టుపెట్టుకున్నాను, ఇక నీతో అసలు మాట్లాడకుండా ఉంటానని... లేకపోతే అసలు నీ ముఖం చూడాల్సిన అవసరమేమిటీ నాకు? నేను తలచుకున్నప్పుడల్లా కనపడటం లేదు కాని... "నేను కనపడనప్పుడల్లా ఏంచేస్తావ్?" అని అడుగుతా వెందుకు మహా గొప్పగా, అక్కడి కేదో ఘనకార్యం చేస్తున్నట్టు? నీలాగా నాకు కవిత్వం వచ్చా! తిట్టడం వచ్చా! కోపగించుకొని అలిగి కూర్చోవడం వచ్చా!... అవునులే నీకు నవ్వుగానే ఉంటుంది... ఏమిటీ మళ్ళీ చెప్పు! "ఇవేమీ నీకు రాకపోతే ఇబ్బంది లేదులే. నా తల నిమరడంవచ్చు" నా కన్నీళ్ళు తుడవడంవచ్చు. అదిచాలు అంటున్నావా?... నిజంగా కవీ! నా కవి కూడా వచ్చునంటావా?... నీవు కనపడకపోతే ఏమీ చేయులేక భలే ఏడుస్తాను కవీ!... నీవు నమ్మలేవా నే నేడుస్తాను నీ కోసం అంటే?... పోనీ నమ్మకు... "నీ వెందు కేడుస్తావ్, నీకోసం నేను పడి చావాలి కాని" అంటున్నావా? మొదలు పెట్టావ్ నీ సాధింపు! బాబూ నీవు కవివి. నీవు ఏదన్నా చెల్లుతుంది. నీలాగ నాకంత అందంగా సాధించడమేమొచ్చు. ఆ వచ్చీరాని నాలుగు మాటల్ని నీముందు అనడానికి ఎంత సిగ్గు పడతాననుకున్నావ్!... నీవేమీ నమ్మవులే. ఎంతసేపూ నీవే నన్ను ఆరాధిస్తున్నట్టూ, అయినా నేనేమీ లెక్క చేయనట్లు మాట్లాడుతావు. అసలు నీకీ

తప్పుడభిప్రాయం ఎలా ఏర్పడిందంటూ?... "మరి నేను నీ దగ్గఱ ఉన్నప్పుడు కూడ అప్పుడప్పుడు నేను లేనట్లుగా ఏదో పరధ్యానంగా ఉంటా వెందుకు?" అని అడుగుతున్నావా? మంచి చిక్కుప్రశ్నే నే!... అంతేనా నీకు తెలిసింది? మరి ఇది కూడా తెలుసుకో నీవు నా దగ్గఱ లేనప్పుడు కూడా, నీవు నాసమీపంలోనే ఉన్నట్టుంటుంది ఒక్కొక్కసారి... నిజంగా నీవు నా దగ్గఱే ఉన్నావనుకుని కబుర్లు చెప్పేస్తాను. అవి నీ పాదాలే అనుకొని నా కన్నీటి జల్లుతో అభిషేకిస్తాను. అలాగే తన్మయత్వంలో నీ పాదాల దగ్గఱ సోలిపోతాను. మెళుకువ వచ్చి చూస్తే నీవు ఉండవు అక్కడ! దానికేమంటావ్? లోన నీకు నమ్మాలని ఉన్నా, పైకి నమ్మనంటా వెందుకు?... నీ దొంగవేషాలు నాకు తెలియవు కాబోలు. మళ్ళీ ఒకసారి చెబుతున్నాను ఇదివరకెప్పుడో ఒకసారి చెప్పిన సంగతి. నీవు ఎన్ని వేషాలు వేసినా, నన్నెంత మభ్యపెట్టినా, నిన్ను నేను గుర్తిస్తూనే ఉంటాను. నీకు తెలియకుండా నిన్ను నేను ఆరాధిస్తూనే ఉంటాను. ఇదుగో! ఇంతకీ బోసికుర్చీ ప్రశ్నకి సమాధానం ఏమిటి?... "ఛీ! ఛీ! పాడుబుద్ధి! నీవూ, నేనూ ఉన్నాం మధ్యలో బోసి కుర్చీ సంగతెందుకు నీకు?" అంటున్నావా!... పోనీలే ఎత్తను. నీ అంతట నీవు చెప్పేవఱకు ఊరుకుంటాలే... అయినా కవీ ఇంకా బోసికర్చీ మీద కోపం పోలేదా నీకు?...పాపం మంచిదే బోసికుర్చీ, ఎందుకో ఒక్కొక్కసారి అలా విరుచుకు పడుతుంది. కాని...ఏమో ఎవరి గొడవలు ఎవరికి తెలుస్తాయి !!

## 35

కవీ! ఎంత మంచివాడవు నీవు! నిన్నెలా కొలవను చెప్పు !! నన్ను బిక్కముఖం పెట్టొంద్దంటావ్! అది చూచి భరించలేనంటావ్! నా కళ్ళనుండి నాకు తెలియకుండానే కారి పోయే కన్నీళ్ళను తుడుస్తున్నావా? చూడు నీ చేతులెలా తడిచిపోయాయో నా కన్నీటితో! ఇలాతే నేను తుడస్తా నీ చేతుల్ని... ఏమిటంటున్నావ్? నేను ఏడుపు మానకపోతే నీవూ ఏడుస్తావా గట్టిగా! గొప్పపని చేస్తావ్!... నా చిట్టి కవీ! నే నెందుకేడుస్తానమ్మా! అందులో నీ ముందు, నీ ముందె ప్పుడూ నవ్వుతూనే ఉంటానే. నీవు లేవనుకుని ఏడ్చానేమొ! ఊరుకో బాబూ!... "బోసికుర్చీ నీ మీద ఇంకా పగదీర్చుకోవ డానికి ప్రయత్నిస్తోందగదూ! ఈ నిముషం స్నేహంగా ఉం టుంది, నీదగ్గఱ చేరుతుంది. నీవు వినిపించుకోక పోయినా, యిష్టపడక పోయినా తెగ పొగడేస్తుంది. మరునిముషం అవతలకు పోయి అనవసరంగా అవాకులు చెవాకులు నర్మగర్భంగా ఒక సారి, ఉప్పెనగా మరొకసారి, వాగేస్తుందికదూ!... ఇదంతా మనసులోనే పెట్టుకుని నాదగ్గఱ పొరపాటునైనా ఎప్పుడూ పెదవి జారవు నే నెక్కడ దానిమీద విరుచుకుపడతానో అని. నీవు చెప్పకపోతే నాకు తెలియదా? బోసి కుర్చీయే నాతో చెప్పింది పనిగట్టుకుని... బోసి కుర్చీ మాటలు వింటున్నకొద్దీ, నిన్నింకా పిచ్చిగా తన్మయత్వంతో ఆరాధిస్తున్నాను. నిన్ను

ఇంకా, యింకా నా హృదయాంతరాళంలోకి లాగేసుకుని, నిన్ను బోసికుర్చీ కంటపడకుండా దాచేసుకోవాలని ఉంది' అంటున్నావా!

నా కవీ! ఎదీ నీ ముఖం! నా చేతుల్లోకి తీసుకోనీ! ఎవరవమ్మా నీవు! నీవు నాకోసమే; నన్ను ఓదార్చడానికే అవతరించావు కదూ! బోసికుర్చీ నన్నుగురించి ప్రచారంచేసే కల్లబొల్లికబుర్లను నమ్మకుండా, నన్నింకా ఎక్కువ తన్మయత్వంతో ఆరాధిస్తున్నానంటున్నావా!... ఏనాడు పెట్టి పుట్టానో, నీవు నాకుదొరికావు. నన్ను ఎంత క్షుణ్ణంగా, ఎంత సంపూర్ణంగా, సరిగ్గా అర్థం చేసుకున్నావ్!! కవీ! నీ ఋణం నే నెలా తీర్చుకోగలను! నేను చచ్చిపోయి, నాఆత్మ నీలో కలిసిపోతే ఎంత బావుంటుంది!! ఆ అదృష్టం ఎప్పటికో!!!

## 36

"బోసికుర్చీ ఏం చేస్తోందీ, ఏమంటోందీ" అని అడుగుతున్నావే వచ్చీరాగానే యీ వేళ? బోసికుర్చీ ప్రశ్నకి సమాధానం చెబుదా మనుకుంటున్నావా?... కాదూ?... ఇప్పుడప్పుడే చెప్పవా?... పోనీలే. నీ యిష్టం వచ్చినప్పుడే చెప్పు... కవీ! ఇంతకీ బోసికుర్చీ అనుకుంటుందీ, నీ వెవరివో తనకు బాగా తెలుసునని. ఈ క్షణం ఈ వ్యక్తిని చూస్తుంది. ఇతనే

'కవి' కాబోలు ననుకుంటుంది. ఆ క్షణం ఆ వ్యక్తిని చూస్తుంది. "పొరబడ్డాను. ఇతను కాదు అతనే 'కవి'" అనుకుంటుంది. మరో క్షణం మరో వ్యక్తిని చూస్తుంది. వాళ్ళిద్దరూ కాదు, ఈ వ్యక్తే నిజంగా 'కవి' అనుకుంటుంది. ఇలా ఒక పొరపాటుతో మరొక పొరపాటు గొలుసుకట్టులా అల్లుకుపోతోంది... ఇంకా గొప్పగా తనకేదో నిన్ను గురించి తెలిసేసినట్లుగా, నాకొకతే చెప్పేస్తుంది నిన్ను గురించి. ఒకసారి నవ్వువచ్చి అడిగేద్దామను కున్నాను "నిజంగా నా కవి ఎవరో నీకు తెలుసునా ?"అని... ఏమిటీ ?... "ఎందుకడగలేదు మరి ?" అంటున్నావా ? ఇదింకా బావుంది. నే నెందుకడుగుతాను. మళ్ళీ అదో తేనిపోనిగొడవ. తానే నీ వెవరివో గుర్తిద్దామని ప్రయత్నిస్తోందిగా... ప్రతి క్షణం గుర్తించేశాననే అనుకుంటోందాయె. సాగనీయ్ అలాగే మధ్యలో నా అంతట నేను కల్పించుకున్నానంటే, తన నేదో పరాభవించా ననుకుంటుంది దాంతో మరింత ఉడికిపోతుంది. అదేమనుకుంటే మాత్రం నీకూ, నాకూ పోయిందేముంది ? నీ వెవరివో నాకు తెలుసు. నే నెవర్నో నీకు తెలుసు.

కవీ ! నిజంగానే నీవు నాకు కవిలాగానే ఎందుకు సాక్షా త్కరిస్తున్నావు ?... "మీ రాకి తన ఆరాధ్యమూర్తి కృష్ణుడి లాగానే ఎందుకు సాక్షాత్కరించాడు ? రామదాసుకి, రాముడి లాగానే ఎందుకు ప్రత్యక్ష మయ్యాడు ?" అని అడుగు తున్నావా ?... గట్టి ప్రశ్నేనే ! మీరా, కృష్ణుడి రూపంలోనే

ఊహించుకుంది తన ఆరాధ్యమూర్తిని. రామదాసు, రాముడి రూపంలోనే ఊహించుకున్నాడు. అందుకని వాళ్ళకలాగ వేరు వేరు రూపాలలో కనిపించాడు వాళ్ళ ఆరాధ్యమూర్తి... "మరికనేం. నీకూ అంతే. నీవు 'కవి' రూపంలోనే నన్ను ఊహించుకుంటున్నావు. ఆకవికి ఉదాత్తగుణాలని, ఉదారస్వభావాన్ని, ఆత్మీయతను, సున్నితమైన భావాలను ఆపాదించుకుంటున్నావు. నీ మనస్థత్వానికి దగ్గఱగా నన్ను రూపొందించుకుంటున్నావు. నన్ను సృష్టించుకుంటున్నావు... నేనంటే నీకు గల ఆత్మీయతను, తన్మయత్వాన్ని ఆలోచించుకుంటేనే నేను మైమరచిపోతాను" అంటున్నావా ?... కవీ ! ఏం చేయను ! నిజంగా నాకు సంతోషంతో పిచ్చెత్తిపోతోంది !!... ఏమిటీ ? "బోసికుర్చీ ఇప్పుడు కాకపోయినా, మరొకప్పుడైనా అసలు నీ 'కవి' ఎవరూ ? అని అడుగుతుంది అప్పుడు ఈ ప్రశ్నకీ, ఈ మధ్య అడిగిందన్నావే 'కవీ, నీవూ ఒకళ్ళ కొకళ్ళు ఏమవుతారని', ఆ ప్రశ్నకూ కలిపి ఒకేసారి సమాధాన మిద్దువుగాని బోసికుర్చీకి" అంటున్నావా?...

కవీ ! అది సరేకాని, పోనీ నాకు చెప్పగూడదూ మనం ఒకళ్ళ కొకళ్ళం ఏమవుతామో !... చెప్పవూ ! నీవు చెబితే వినాలని వుంది !... "మనం ఒకళ్ళ కొకళ్ళం అన్నీ అవుతాం" అంటున్నావా ?... నా కవీ ! ఎంత అందంగా అన్నావు మాటల్లో మనిద్దరిమధ్యా గల ఆత్మీయతను !!!

## 37

కవీ ! ఏం చేస్తున్నావ్ ?...చాలా రోజు లయిందంటు న్నావా నిన్ను పలకరించి ? నీ కెప్పుడూ అంతే. ఒక్కక్షణం ఎడమయినా ఎన్ని యుగాలయిందో అంటావ్... అది సహజమే నంటావా ? పోనీ మనిద్దరికీ తగాదా ఎందుకు ? కాదని నేనుమాత్రం అంటున్నానా ? ఊ ! ఏంచేస్తున్నావ్ చెప్పావు కాదేం ?... ఊరికే కూర్చున్నావా ?... ఊరికే ఖాళీగా కూర్చున్నావా ? నన్ను, నమ్ముమనేనా ?... ఓ ! అంటే ఏదో బాధగా కూర్చున్నావనా అర్థం ! అవును బాధ పడకుండా ఎలా ఉండగలవు ?... ఈ క్షణం బాధ పడతావ్ !... మరో క్షణం ఆ బాధని కావ్యంగా మారుస్తావ్... "నీ కెలా తెలుసు" నంటున్నావా ? ఎలా తెలుసు నేమిటి ? "నీవు ఎందుకు బాధ పడతావ్ ? ఎందుకు కవిత్వం వెదజల్లుతావ్" అంటే ఏం సమాధాన మిస్తావు ?... అలాగే నేనూను. నీవు ఏ క్షణం ఏం చేస్తావో నాకు తెలియకపోతే ఇంకెవరికి తెలుస్తుంది ?...

కవీ ! దీనికి సమాధానం చెప్పమ్మా ? నన్నుగురించి ఎప్పుడూ అంత ఉలికిపడతా వెందుకు ? నేను నీకు కాకుండా పోతాననే పిచ్చి భయమా ?... నా పిచ్చి కవీ, ఎందుకమ్మా ఆ సందేహం నీకు ? "నిన్నెందుకు, ఎలా ప్రేమిస్తున్నానో తెలుసును కనుకనా, ఎందుకు ఉలికిపడతానో తెలియడానికి !

ఈ రెండూ నా శక్తికి మించినవే... నిన్నుగురించిన ప్రీతిదీ నాశక్తికి మించిందే” అంటున్నావా ?... నేను మాత్రం కాదన్నానా ? ఎంతటి అసహజాలైనా, ఎన్ని అసందర్భాలైనా నీపట్ల అన్నీ సహజాలే. ఎవరూ కాదనరు...కాని కవీ! ఒక్క ప్రార్థన... ప్రయత్నించవూ నాకోసం! అవసరమయితే, నే నేమీ అనను కాని... అనవసరంగా మాత్రం నన్నుగురించి ఉలికిపడకు. నా కవివి కదూ ! నీవు అనవసరంగా నన్నుగురించి బాధ పడుతుంటే ఊరుకోగలనా చెప్పు ! ఎలా నిన్ను ఓదార్చాలో కూడ నాకు అర్థంకాదు అలాంటప్పుడు... చూడు ఎంత నిర్మలంగా ఉందో ఇప్పుడు నీకు... నీ కావ్యాలని వినిపించనా ?...

## 38

నా కవీ ! బాబూ ! పలకవేం ? నా మీద కోపమా? నిన్ను మర్చిపోయా ననుకున్నావా?... లేదమ్మా పడవకు. నిన్నెలా మర్చిపోతాను ! అది నా శక్యంకాదు. ఎప్పటి కప్పుడు నిన్ను మర్చిపోదామని ప్రయత్నిస్తాను... మర్చిపోయా ననుకుంటాను... కాని ఉప్పెనలా చుట్టుకుంటుంది, నీ తలంపు నన్ను హఠాత్తుగ. మనస్సును వెఱ్ఱెత్తిస్తుంది. మనస్సుని ఆకలితోమాడుస్తుంది. ఇక నిన్ను తలవకుండా ఉండలేను. నిన్ను నా దగ్గఱకు చేర్చుకోకుండా ఉండలేను... ఆ పని ఎంత అశక్తతకు లోనై

చేస్తానని! నేను కావాలని కోరుకొని కూడా ఆ పని చేయను. అలాంటప్పుడు నేను నీ సామీప్యానికి చేరకపోతే జరిగేదేమిటో తెలుసా ?... పిచ్చెత్తిపోవడమే ! ... కవీ ! నా కనిపిస్తుంది, పిచ్చెత్తిపోతేనే హాయేమోనని. ఎందుకంటే ఎప్పుడూ నీ సామీప్యంలోనే, నిన్నే జపిస్తూ, నా మనస్సు నాట్యంచేస్తుంది తన్మయత్వంలో...కాని బోసికుర్చీ నన్ను ఆటంక పఱుస్తుంది. హద్దుల్లో పెడ్తుంది. అలా హద్దుల్లో ఉండటానికి నాకేమి అభ్యంతరం లేదు కాని, నా మనస్సు నీకోసం అఱ్ఱులుచాచే క్షణమైనా బోసి కుర్చీ కనికరించి, నన్ను తన్మయత్వంలో స్పృహ తప్పిపోనిస్తే ఎంత బావుండును. ఆ క్షణం కూడా నా మనస్సుని ఎగిసి పోనీయకుండా, కరిగి పోనీయకుండా, దానిని నా అచేతన శరీరంలో కట్టివేస్తుంధే... అబ్బ! ఎలా చెప్పు కవీ! దానిని ఛేదించుకు రాలేక నా మనస్సెంత యాతన పడుతుందో గ్రహించావా !... కవీ ! నన్ను రక్షించ గలిగే శక్తి నీ కొక్కడికే ఉంది. మనస్సు పడే యాతనకు, నా అచేతన శరీరం కూడ సుడులు తిరుగుతోంది బాధతో... కవీ ! ఎందుకు రావు నా దగ్గఱకు? నిన్ను మర్చిపోదామని ప్రయత్నిస్తున్నందుకు తగిన శాస్తి అయిందనుకుంటున్నావా?... నీవేమన్నా అనుకో కాని నన్ను మాత్రం ఈ క్షణమైనా నీలోకి తీసుకో...లేకపోతే సుడిగాలిలా నిన్ను లుంగేసుకుంటాను పిచ్చెత్తిపోయి.

## 39

పిచ్చికవీ! ఎందుకమ్మా ఏడుస్తున్నావ్! నా బాబువి కదూ చెప్పు! నేను బాధపడు తున్నానని ఏడుస్తున్నావా?... లేదు, నేనేం ఏడ్వడంలేదు. రా, నా దగ్గఱకు... నా తండ్రివి కదూ! ఏడవకు... ఎదీ కళ్ళెత్తి నావంక చూడు... బెంబేలు పడిపోయావా పసిపాపలా, నేను ఏడ్వడం చూచి...అవును నిజమే నాదే తప్పు. నీ ముందు ఎందుకలా గోలపెట్టి ఏడవాలి నేను...కాని కవీ! నీముందు కాక ఇంకెవరిముందు అలా గగ్గోలు పడను? బోసి కుర్చీ భరించగలదా? అలాంటప్పుడు నన్ను చూచి పిచ్చెత్తిందని అనుకుంటుంది. హద్దుల్లో పెట్టడానికి ప్రయత్నిస్తుంది. మనసుకు గొలుసులు తగిలిస్తుంది...అక్కడికీ నన్ను నేను ఎంత కుంచించుకుని బ్రతుకు తున్నానో తెలుసా కవీ! నిన్ను గురించి మర్చిపోవడానికి ప్రయత్నిస్తాను...కవి నీవే రూపంలో ఉంటావో గుర్తుండదు...బోసి కుర్చీ ఎవరో అసలు గుర్తుండదు. మీ రిద్దరూ స్త్రీలో; పురుషులో కూడ నాకు గమ నంలోకిరారు. కేవలం హృదయాలుగా మాత్రమే గోచరిస్తారు. మిమ్మల్ని చూచి మాట్లాడుతూనే ఉంటాను. శరీరాల్ని చూస్తు న్నట్లు కనపడ్డా, అవి నాకంటికి కానవు. వాటిలోని మనస్సులు హృదయాలు మాత్రమే స్నేహంగా పల్కరిస్తాయి నన్ను... ఈ సంగతి బోసికుర్చీకి అర్థంకాదు. ఎప్పుడైనా ఈ సంగతి అర్థ మయినా కూడ, మళ్ళీ వెంటనే పొరపాటు పడినట్టుగా నాలుక

కరచుకొని, తప్పుడర్థాలు తీస్తుంది... నీవు చెప్పు నేనేమయినా అపకారం చేశానా తనకి?... తాను హాయిగా ఉండి, నన్ను హాయిగా ఉండనివ్వొచ్చుగా బోసికుర్చీ?... పెద్ద న్యాయాధికారిలా తీర్పులు తీరుస్తుందేమిటీ తీరుబాటుగా?... తన కాళ్ళతో తన్నుకుంటుంది, చేతులతో చెవులు కొరుక్కుంటుంది ఎందుకు?.. స్వతహాగా మంచిదే. కాని అదేం సరదాయో! కొంచెమైనా విశాలపడడానికి ప్రయత్నించదు, ఇష్టపడదు. మునగదీసుకు, అలా పిడచకట్టుకు పోతుందేమిటి?... కవీ! ఇక తీయి, నీ తల నా ఒడిలోనుంచి. ఒక్క వాగ్దానంచేయి. ప్రతిక్షణమూ కాకపోయినా, నా బాధను గుర్తించిన క్షణమైనా నా మనస్సుని ముసురుకోవూ!!

## 40

కవీ! ఎంత ఒంటరిగా ఉందనుకున్నావ్!... ఒంటరితనం క్రొత్తేమీ కాదు. అలవాటేలే నాకు... ఎంత అలవాటైనా ఒకొక్కక్కసారి మరీ విసుగెత్తుతుంది కవీ. ఒంటరి పయనమే శరణ్యా మనుకో...అయినా కవీ నీవున్నావుగా తోడు. పరోక్షంగా నన్ను నడిపించే శక్తి నీవేనని తెలుసు... అయినా ప్రత్యక్షంగా కూడ నీతో ఏమిటో చెప్పుకోవాలని, హృదయారాటం తగ్గించుకోవాలని ఉంటుంది...కవీ! చెప్పవూ! నే

నందరాని శిఖరాలకు ఎగురుతున్నానంటావా? కాదుకదూ! నీ సామీప్యాన్ని చేరాలనుకోవడం నేరంకాదు కదూ! కవీ! నీకు నేను చాల దగ్గర్లో ఉన్నట్టుగా అనిపిస్తుంది... ఏమి చేమిటో నా అవ్యక్త భావాలను నీ ముందు విప్పాలని ఉంది, నీ ఒక్కడవే అర్థం చేసుకుని, సానుభూతి చూపగలవు కనుక. కవీ! నిన్ను పూజించడమే కాదు నీతో స్నేహంగా కబుర్లు చెప్పుకోవాలని ఉంటుంది. ఒక్కొక్కసారి నీ కన్నా నే నే శక్తి వంతురాల్ని అనిపిస్తుంది. నీ ముఖం కన్నీళ్ళతో, నా ఆదరణ కోసం ఎదురు చూస్తున్నట్టుగా అగుపిస్తుంది. అప్పుడు నిజంగా, నిన్ను తల్లిలా చేరదీసుకోవా లనిపిస్తుంది. మరో క్షణం నీవో పెద్ద శక్తిగా, తల్లిలా అవుపిస్తావు. అప్పుడు నీ హృదయంలో తల దాచుకుని, నా మనస్సుని విప్పుకోవాలని ఉంటుంది. బోసి కుర్చీకి బ్రహ్మాండాలుగా కనపడే భౌతిక విషయాలు, లౌకిక విషయాలు ఎంత స్వల్పంగా కనపడతాయని నాకు! దానికి కనపడని హృదయపు లోతులు, మానసికపు ఆందోళన నన్నెంత గందరగోళ పరుస్తాయని! బోసి కుర్చీ నా మానసికపు ఆకలిని గుర్తించలేదు. పోనీ నా అంతట నేను చెప్పుకుందామన్నా ఎలా, తను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించదుగా? ఇష్టం లేకో, శక్తిలేకో?... కవీ! బోసి కుర్చీని చూచి "పోనీలే దీనిని బాధపెట్టడం ఎందుకు, నా పిచ్చి ఊహాలతో, భావా లతో" నని ఊరుకున్నా, ఒక్కొక్కసారి నేను నిలువు

నా కంపించిపోతాను. ఏక్షణం తీరుబాటయితే ఆ క్షణమే నా మనస్సు నీవైపు పరుగెడుతుందని తెలుసు. అందుకే అనుక్షణం నన్ను నేను ఏదో పనిలో నిమగ్నం అయ్యే ట్లు ఎంత చూచుకుంటానని!... కాని ఒక్కొక్కసారి నా ఇంత ప్రియత్నమూ వ్యర్థమే. నా మనస్సు, నా శరీరాన్ని ఛేదించుకొని, ఊపిరి పీల్చుకోవాలని ఎంత గింజుకుంటుందను కున్నావ్! కవీ! బహుశా ఇంక ఎంతో కాలం నా మనస్సుని బంధించి ఉంచలేను. అది నా శక్తికి మించిన పనవుతోంది... కవీ! నీతో ఎంత తేలికగా చెప్పుకుంటానో చూడు నన్ను గురించి...నీ వెవరివో పరాయివాడివిగా వేరుగా అనిపించవు. ఒక్కొక్కసారి నీ మనస్సేదో, నా మనస్సేదో గుర్తించలేక తికమక పడతాను. ఏమిటీ, "రెండూ ఒకటే. వేరువేరుగా గుర్తించడానికి ప్రయత్నించడం పొరపాటు" అంటున్నావా... నిజం కవీ! నీ మాటే నిజం!!